# బహాదూరప్ప బాటసారి





రచన

యామినీ సరస్వతి



నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ • విజయవాడ.2.

# ముందుమాట

వస్తువుల ధరలు, వరుల ధరలు ఆకాశాన్నంటుతున్న ఈ రోజుల్లో మధ్య తరగతి కుటుంబాలు ఎలా తల్లడిల్లి పోతున్నాయో? ఏ సమస్యల సుడిగుండాల్లో చిక్కుకుని విల విల లాడి పోతున్నాయో? అందునా ఆడపిల్లలను కన్న తల్లి దండ్రుల సంగతి వేరే చెప్పక్కర్లేదు.

పరువు మర్యాదల కోసం ప్రాకులాడాలో? వీటన్నిటిని పక్కకు నెట్టి, అమ్మాయిలకు మంచి వరుళ్ళని తేవటానికి ఆరాట పడాలో? అడ్డమైన వాళ్ళని ఆశ్రయించాలి? ఎందరిచేత రావనిపించికోవాలి? ఆడపిల్లల తండ్రి అంతటి దురదృష్ట వంతుడు లేడీ భారత దేశంలో! ఏది ఏమైనా బిడ్డల శ్రేయస్సు కోసం సర్వస్వం ధారపోయని తండ్రి ఉండడు.

అంతటి బాధామయ జీవి మరొకడు ఉండడు!

ఒక దాని వెంట ఒకటి తగులుకునే ఈ బంధాలు ఎప్పటికీ వీడవు. ఈ జీవితం మహా ప్రవాహం! అందులో ఎన్ని సుడిగుండాలో? ఎన్ని ప్రశాంత ప్రవాహాలో——ఒక సారి గలగలా పారుతూ, మరో సారి ఉరుకులు పరుగులతో ఇంకో చోట సుడిలా గిరగిరా తిరుగుతూ... అనివార్యమైన మలుపులు తిరిగి, కొండలూ కోనలూ దాటి... ఏ గమ్యం చేరుతుందో... ఏ తీరంలో ఆగుతుందో——ఏ విధంగా సాగుతుందో ఆ సర్వాంతర్యామికే తెలియాలి.

రచయిత్రి

# మా క్రొత్త ప్రచురణలు

బంగారు సంకెళ్ళు
కళ్యాణి
వెలిగించని దీపాలు
విరిజల్లు
కర్పూర కళిక
దాంపత్య నౌక
రాగవాహిని
కీర్తి రథం
అనాఘ్రాతపుష్పం
బహుదూరపు బాటసారి
దాంపత్యాలు
సౌందర్య
డాక్టరమ్మ
ప్రేమబంధం
ట్రీట్ మెంట్
భిన్నస్వరాలు
సంసార సుఖం
అంతిమ క్షణాలలో అక్బర్
గమ్యం చేరని బాటసారులు
ప్రేమారాధన
మధిరమ
స్వయిరిణి
సౌఖ్యజ్వాల

చిగురించిన జీవితాలు
చెరవిడిన హృదయాలు
చివరి మజిలీ
వెండి వెన్నెల
దిగంతాల కావల
కప్పులేని కొంపలు
తుషార ప్రతిమ
అంతం చూసిన ఆడది
ఆశాతరంగాలలో ప్రేమనౌక
కుంకుమ రేఖ
జీవనమాయ
రెక్కలొచ్చిన చిలక
మధుకీల
ఓ తల్లి కథ
రాగతరంగం
ఆశల హరివిల్లు
రాగస్రవంతిలో రాతిబొమ్మ
అహమా? నువ్వెన్ని మెట్లెక్క గలిగాక
నీకీవారసత్వంవద్దు
తీరం చేరిన తొలికెరటం
చీకటి పడిన సూర్యుడు
పూర్ణ

**తప్పక చదవండి !**

# బహుదూరపు బాటసారి

జానకి రామయ్యగారు వీధిలో నుంచి వచ్చి పడక్కుర్చీలో కూలబడ్డారు. ఆయన మొహం అలసిపోయి చెమటతో తడిసిపోయి ఉంది. పైకండువాతో మొహం తుడుచుకుంటూ లోపలికి చూశారు. ఎవరూ ఉన్న అలికిడి వినిపించలేదు. "శారదా! కాసిని మంచినీళ్ళు తీసుకురా తల్లీ" అని పిలిచారు గట్టిగా.

లోపలినుంచి కంగారుగా వచ్చింది లలితమ్మ, మంచినీళ్ళందిస్తూ పరిశీలనగా చూసిందాయన మొహంలోకి. ఎండ దెబ్బకు వాడిపోయి అలసిన ముఖం, ఎక్కడికైనా వెళ్ళి వస్తే భర్త వాలకం అంతేనని తెలుసావిడికి. "పిల్లలంతా ఎక్కడికెళ్ళారు?" అన్నారు గ్లాసు కిందపెడుతూ.

"ఇవ్వాళ శుక్రవారం కదూ?" భావగర్భితంగా ఆయన మొహంలోకి చూసి తల వంచుకుంది బాధగా.

దీర్ఘంగా నిట్టూర్చి వెనక్కి వాలిపోయి కళ్ళు మూసుకున్నారు. ఏడుగురు ఆడపిల్లలకి తండ్రి ఆయన. హృదయంలో ఎన్ని సమస్యల వలయాలు సుడులు తిరుగుతున్నాయో ఎవరు చెప్పగలరు? మహా సముద్రంలాంటి సంసారం!

భర్త ఎంతసేపటికీ కళ్ళు తెరవకపోయేసరికి కొంచెం కంగారు పడింది. "వెళ్ళిన పనేమైంది?" మెల్లిగా అడిగింది. కాలేదన్నట్లు పెదవి విరిచారు.

"ఏం, కట్నం ఎక్కువలో ఉన్నారా?"

"కట్నందాకా వెళితేగా అసలు విషయం మన గోత్రం వాళ్ళ గోత్రం ఒకటయిపోయింది."

"చక్కెదురయిందన్న మాట" పుస్తకాల రేక్ కి ఆనుకుని కూర్చుంటూ నిట్టూర్చిందావిడ.

"లోపలికిపోయి అదేం గొడవ చేస్తుందో పోయి చూడరాదూ?" భార్య అలా నిశ్చింతగా కూర్చోవటం ఆయనకి సరిపోలేదు.

"ఏం చూడమంటారు? నాలుగేళ్ళు చూస్తూనే ఉన్నాను గుండెలు పగిలిపోయేట్లు! పెళ్ళీడు కొచ్చిన పిల్లకి చూపు దూరం చేసి, దాని జీవితం ఆ రకంగా అన్యాయం చేశాడు. పెళ్ళయి రెండేళ్ళయినా కాలేదు. దీని రాత ఇట్లా తెల్లవారింది. ఏం పాపం చేశామో పూర్వజన్మలో" ఆమె కొంగు మొహానికడ్డుపెట్టుకుని నిశ్శబ్దంగా ఏడుస్తోంది. ఆయన హృదయం చిద్రుపలై పోతోంది ఆ ఏడుపు వింటుంటే!

ఆయన హృదయంలో రెండు కళకళా మండే అగ్ని

గోళాలు శారద, జ్యోతిర్మయి. పెద్ద పిల్ల కనకదుర్గ రెండోది బాలా త్రిపుర సుందరి. ఇద్దరికీ అనువైన సంబంధాలు చూసి పెళ్ళి చేసేశారు. మూడోది శారద. పెళ్ళయిన రెండేళ్ళకే సౌభాగ్యం తుడిచేసుకుని పుట్టిల్లు చేరింది.

శారద అత్తగారిది మంచి సాంప్రదాయంగల కుటుంబం. ఆమె భర్త రాజు స్కూలు టీచరుగా పని చేస్తుండేవాడు. శుక్రవారం ఆ ఇంట్లో లక్ష్మీ పూజ జరిగేది. అత్తగారు కోడల్ని ఎంతో అపురూపంగా చూసుకునేది. చక్కని రూపు రేఖలు కలిగిన శారద అలంకరించుకుంటే అపర లక్ష్మీ దేవిలా వెలిగిపోతుండేది. ఆ రూపంలో భార్యని చూసి తెగ మురిసిపోతుండేవాడు రాజశేఖరం. అతను ఉభయ భాషా ప్రవీణ. కమ్మగా కవిత్వం వ్రాసేవాడు. అందాలు చిందే భార్యని అపురూపంగా దేవతలా చూసుకునేవాడు.

పట్టు చీరల్లో, తల నిండా పూలతో ఒంటినిండా నగలతో మెరిసిపోయే శారదని చూస్తే అతనిలో కవితా వాహిని వెల్లువలై పారేది. వెన్నెలలో స్నానమాడినట్లుండే భర్త సన్నిధిలో పరవశించి పోయేది శారద. అతని తన్మయత్వం, పారవశ్యం గుర్తుకు వచ్చినపుడల్లా ఆవేశంతో ఊగిపోతుంది ఇప్పటికీ!

భర్త పోయాక కూడా శుక్రవారం వచ్చిందంటే, ఆమె పూర్వం లాగే అలంకరించుకునేది. భర్త ఫోటో ఎదురుగా పెట్టుకుని పిచ్చి పిచ్చిగా మాట్లాడేది. హిస్టీరియా పేషంటులాగా ప్రవర్తించేది. మొదట్లో లలితమ్మ కూతురు

అలా అలంకరించుకోటానికి ఒప్పుకునేదికాదు. కూతురి పరిస్థితి చూసి జానకి రామయ్య హృదయం జాలిగా కరిగిపోయ్యేది. ఆయనలోని సంస్కారం మెల్లగా తలఎత్తేది. మనం ఏర్పరుచుకున్న ఈ మూఢాచారపు సంకెళ్ళు మనమే తెగ్గొట్టుకోవాలి అనుకునే వారు ఆవేశంగా ఒక్కోసారి!

అందుకే ప్రతి శుక్రవారం ప్రత్యేకించి శారద కోసం పూలు తెచ్చే వారు. సర్వాలంకార శోభితయైన కుమార్తెని చూసుకుని గుండెలు పగిలేలా మనసులోనే ఏడ్చేవారు. అంత కన్నా ఇంకేం చేయలేని నిస్సహాయ స్థితి!

మొదట్లో కొంచెం కష్టంగా, వింతగా అనిపించినా క్రమంగా అందరికీ అలవాటై పోయింది ఆ పరిస్థితి. తాత్కాలికమైన ఆమె ఆనందాన్ని హరించటానికి ఎవరికీ మనసొప్పేది కాదు.

వితంతు వివాహాలు కొన్ని జరుగుతున్నాయి కాని, అటు సంప్రదాయాన్ని విడిచిపెట్టలేక, ఇటు ఆధునికతను పూర్తిగా ఆచరించ లేక సతమత మౌతున్న రోజులవి; ఆయన ఎటూ నిర్ణయించుకో లేక పోయేవారు. ధైర్యంగా ముందడుగేసినా, ఇంకా ఆడ పిల్లలున్నారు. వాళ్ళ కెలా పెళ్ళిళ్లు చేయగలం? అనే ప్రశ్న భూతంలా ఎదురుగా నిలిచేది. దాంతో అడుగు వెనక్కి పడేది.

జ్యోతిర్మయి జ్యోతుల్లా వెలుగుతుండే కళ్ళతో, తెలివి నిండిన ముఖంతో ఎంతో సుకుమారంగా అందంగా ఉండేది. ఒకసారి బస్సులో ప్రయాణం చేస్తుండగా యాక్సిడెంట్ జరిగింది. ప్రాణాలు దక్కాయి గాని, ఆ పిల్లకిలోకం

అంధకారమై పోయింది. ఆతండ్రి హృదయాకాశంలో అంధ కారం కమ్ముకుంది.

భర్త ఆలోచనల్లోకి జారిపోయాడని గ్రహించింది లలితమ్మ. ఆ ప్రవాహానికి అంతు ఉండదు.

సాయంత్రం కావటంతో, మంజుల సరస్వతి స్కూల్ నుంచి వచ్చేశారు. ఇద్దరూ తండ్రి పోలికే! దూరాన్నుంచి చూస్తే కవల పిల్లలా కనిపిస్తారు. మంజుల వస్తూనే అక్క మీద ఫిర్యాదు చేసింది.

"నాన్నగారూ అక్కని, సైన్సు టీచరుకొట్టింది"అంది పుస్తకాలు అలమారులో పెట్టేస్తూ. ఆమాటలతో ఉలిక్కి పడి ఈ లోకంలో కొచ్చారాయన.

"ఏం సరస్వతీ! బాగా చదవటం లేదా?" కళ్ళు విప్పి కుమార్తెవంక కోపంగా చూశారు.

'అనవసరంగా కొట్టింది. 'పక్కమ్మాయి అల్లరి చేస్తే నేనే అనుకుంది' తలవంచుకుని నెమ్మదిగా అంది.

"అక్కయ్య ఏమీ చదవటం లేదుట. వాళ్ళ క్లాస్ టీచరు చెప్పింది."...మళ్ళీ అందుకుంది మంజుల.

"నీకెప్పుడూ చాడీలు చెప్పే గుణమే! అది చదవక పోతే మాన్లే నువ్వు చదివి ఉద్ధరిద్దుగాని" కోపంగా అంది లలితమ్మ.

మంజుల అంటే కోపం ఆమెకు. కొంచెం దుడుకు స్వభావం ఆ పిల్లది. సరస్వతిది మెత్తని మనసు. ప్రతి చిన్న విషయానికి కళ్ళనీళ్లు పెట్టుకుంటుంది. అదీగాక ఇంటిలో తల్లికి ఆ పనికీ ఈపనికీ సాయపడుతుంది. ఎంతసేపటికీ పనంటే

తప్పించుకు తిరుగుతుంది మంజుల. పుస్తకాలుంటే ఇంకో వైపు కన్నెత్తికూడా చూడదు. చదువుల్లో చురుగ్గా ఉంటుంది, శ్రద్ధగా చదివి పైకొస్తుందని తండ్రి నమ్మకం.

"బాగా చదవాలి సరస్వతి.!" అలాగేనని ఇంటిలోకి వెళ్ళిపోయిందామె.

మంజుల పంపు దగ్గర కెళ్ళి కాళ్లు కడుక్కుని గదిలో కెళ్ళింది బట్టలు మార్చుకోటానికి. అందంగా మెరిసిపోతున్న శారదని చూసి ఆ పిల్ల కాళ్లు ముందుకు సాగలేదు. భర్త ఫోటోవంక చూస్తూ మధ్య మధ్య జ్యోతిర్మయి కేదో చెప్తోంది శారద. ఆకళ్ళల్లో వింత ఉత్సాహం. ఆ మెరుపులు హఠాత్తుగా వాకిలి ముందు నిల్చున్న మంజుల మీద నిల్చిపోయినయ్.

"మంజూ ఇలా రావే! చిన్నప్పుడెంత బావుండేదానివో...మీ బావగారు నిన్నెత్తుకుని తెగ ముద్దు చేసేవారు. నువు నవ్వితే బావుంటుందని నీ నవ్వు మీద పద్యం కూడా రాశారు. ఉత్సాహంగా చెప్పుకు పోతోంది శారద.

మంజుల ఆ మాటలు వినలేక. తాత్కాలికమైన అక్క ఆనందాన్ని చూడలేక ముందు రూములో కొచ్చింది. తండ్రి దగ్గరకొచ్చి పక్కనే వున్న స్టూలుమీద కూర్చుని మెల్లగా "నాన్నగారూ!" అని పిల్చింది. కళ్లు తెరచి ఏమిటన్నట్లు చూశారు. మంజుల అలా పిలిచిందంటే అందులోని ఆంతర్యం ఆయనకు బాగా తెలుసు. ఎన్నో వేలమంది విద్యా

ర్థుల హృదయాలని క్షుణ్ణంగా చదవగల ఉపాధ్యాయు డాయన.

"ఏమిటి మంజూ?" లాలనగా అడిగారు.

"మాస్కూల్లో మందారవల్లి లేదూ వాళ్ళక్కయ్యకి పెళ్ళి"...

"అలాగా...వరుడు ఏం చేస్తాడు? ఏ ఊరు?"

"అదంతా ఏమోగానీ, అమ్మాయి వితంతువు. మళ్ళీ పెళ్ళి చేస్తున్నారు." తండ్రివంక సూటిగా చూడలేక ఎటో చూస్తూ అంది.

ఆ పిల్ల చెప్పాలనుకున్న దేమిటో పూర్తిగా అర్థమై పోయిందాయనకి. ఒక్కోసారి వయసుకిమించిన ఆలోచనలు వస్తుంటాయామెకి. ఆ పిల్ల అడిగే ప్రశ్నలకి ఆయనకి తల తిరిగి పోతూవుంటుందొక్కోసారి.

జానకి రామయ్య చిన్నప్పట్నుంచీ పిల్లలందరికీ సం స్కృతం నేర్పించారు. రోజూ రెండు శ్లోకాలు చొప్పున చెప్తుండేవారు. అలా ఒక్కో కావ్యం పూర్తిగా చెప్పే వారు. శాకుంతలం పూర్తి చేశాక ఆ కావ్యం విశిష్టతను గురించి వాళ్ళ హృదయాలకి హత్తుకునేలా బోధించారు. చివరలో "చూడండి శకుంతలలాగా వినయంగా అణకువగా ఉండాలి సరేనా?" అన్నారు కుమార్తెల మొహాల్లోకి సాభి ప్రాయంగా చూస్తూ!

"శకుంతల దుష్యంతుణ్ణి ప్రేమించి పెళ్ళిచేసుకుందిగా మరి?" ఠకామని అడిగేసింది మంజుల. సరస్వతి బిత్తరపోయి చూసింది. తండ్రి కోప్పడతా డేమోనని భయపడింది.

"వెధవ ప్రశ్న లెయ్యకుండా నాన్నగారు చెప్పేదివిను" కాళిదాసు చెల్లెలి వంక కోపంగా చూశాడు. శారద తరువాత వాడు కాళిదాసు. వంశోద్ధారకుడు అతనొక్కడే!

కూతురి ప్రశ్నకి ఎలా సమాధానం చెప్పాలో ఆయనకీ కొంచెం అయోమయంగానే అనిపించింది. మంజుల ఎప్పుడూ ఇలాంటి ప్రశ్నలే అడిగి తండ్రిని ఇరుకులో పెడుతుంటుంది. కాదాంబరి కథ అంతా శ్రద్ధగా విన్నాక ఆటం బాంబు లాంటి ప్రశ్న వేసింది.

"లక్ష్మీదేవికూడా మనోవికారం కలగటం ఏమిటి? దేవతలకే ఆ తప్పులు తప్పనప్పుడు... ఇక మానవ మాత్రులు తప్పు చేయటంలో వింతేముంది?" చెల్లెలి ఆలోచనా శక్తికి శారద, జ్యోతిర్మయి ఆశ్చర్యపోయారు. లలితమ్మ కాళిదాసు మాత్రం "అతివాగుడు, అతి తెలివి అని విసుక్కుంటుంటారు. ఆ పిల్ల అడిగే ప్రశ్నలు విని."

"ప్రతివ్రతలకి కొన్ని ధర్మాలు, నియమాలు అంటూ ఏర్పరిచాక, ఆ నియమాన్ని తప్పిన వాళ్ళని కూడా ప్రతివ్రతల లిష్టులో ఎందుకు వెయ్యాలి? అసలు కుంతి ఏం ప్రతివ్రత? ఈ పురాణాలన్నీ తప్పుల నడకలు" అంటూ తండ్రిని నిలదీసింది మంజుల ఒకసారి.

"ఇవన్నీ ధర్మ సూక్ష్మాలు. నీకు అప్పుడే అర్థంకావు. బుద్ధి ఇంకా వికసించాలి. మనో పరిపక్వత రావాలి. అప్పుడుగాని ఇలాంటి విషయాలు అర్థంకావు. వీటిని గురించి ఆలోచించకుండా క్లాసు పుస్తకాలు చదువుకో" అని మందలించేవారు. "అయినా ఎస్సెల్సీ చదువుతున్న పిల్లకి ఇన్ని ఆలో

చసలా?" అని ఆశ్చర్య పోతుండే వారు తనలో తనే. తన తెలివి కూతురి కొచ్చిందని మురిసి పోతుండే వారు.

# 2

హాల్లో కూర్చుని దిండు గలేబుకి పూలు కుడుతున్న శారద నాన్నగారున్నారా?" అన్న మాటలువిని తలెత్తి చూసింది. వచ్చినవాడు కళాధర్. ఆ కుటుంబానికి దగ్గర స్నేహితుడు ఏదో దూరపు చుట్టరికం వుంది.

"కాలేజీ కెళ్ళి పోయారు. కూర్చోండి" అంది తను లేచి నిలబడి. అతని చూపులు దేనికోసమో చుట్టూ వెదుకు తున్నయ్. అది గమనించి అమ్మ కావాలా?" అంది చిలిపిగా శారద. "ఆఁఅదే వనభోజనాల విషయం మాట్లాడదామని. సుబ్బారావుగారు మీ నాన్నగారితో చెప్పమన్నారు. ఈ ఆదివారం చినరావూరి పార్కు దగ్గర తోటలో ఏర్పాటు చేస్తున్నాం." అతని చూపులు నాలుగు పక్కలా పరిగెత్తు తూనే ఉన్నాయి. ఎక్కడా నిలవటంలేదు స్థిరంగా!

కళ్ళు పోకుండా అన్నీ సక్రమంగా జరిగి వుంటే ఈ జ్యోతిర్మయి ఆతని ఇల్లాలయి ఉండేది ఈపాటికి. ఆ ప్రమా

దం జరిగాక "గుడ్డిదాన్ని కోడలుగా చేసుకుని మేమేంచేసుకుంటాం" అన్నారు కళాధర్ తల్లిదండ్రులు. అతనికి మాత్రం ఆమె మీద ఆశ వదల్లేదు.

కళాధర్ కంఠం గుర్తుబట్టి హాల్లోకొచ్చింది జ్యోతిర్మయి. ఆమెని చూడగానే అతని మొహం సంతోషంతో వెలిగిపోయింది. "జ్యోతీ బావున్నావా?" అన్నాడు ఆప్యాయంగా. "ఆఁ నువ్వే బొత్తిగా మా ఇంటికి దారి మర్చిపోయినట్లున్నావ్" నిష్ఠూరంగా అంది.

కాఫీ తెస్తానంటూ లోపలికెళ్ళి పోయింది శారద.

"జ్యోతీ!" అంటూ ఆప్యాయంగా ఆమె చేతినందుకుని నిమురుతుండి పోయాడు. "కళా! మొన్నేదో సంబంధం చూసొచ్చావట గదా? ఎలాఉంది పిల్ల?"...

"ఎలా ఉందా? పిల్లిపిల్లలా వుంది సరేనా?"కోపంగా ఉడికిపోతూ అన్నాడు. జ్యోతి అలా అడగటం అతనికి నచ్చలేదు.

"అదేవిటి అలా అంటావ్? మొన్న మీ అమ్మగారు మా ఇంటికొచ్చినప్పుడు పిల్ల బావుంది. ఐదు వేలు కట్నం అని చెప్పిందిగా"...ఎంత దాచుకుందామన్నా ఆమె గొంతులో బాధ దాగలేదు.

"చూడు జ్యోతీ! ఈ దేవతని చూసిన కళ్ళతో... ఇంకో స్త్రీని ఎలా చూసేది?

"అది జరగదని తెలిసి ఎందుకు పదిసార్లు అనుకోవటం?...

"ఇదంతా నా ఖర్మ! నీకు చూపు పోవటం నాకు

జీవితం అంధకారంగా తయారైంది. నిన్ను మర్చిపోలేను. మనసు సమాధానపర్చుకోలేను"...

"చూడు కళా... మొదట బాధ పిచ్చిగా ఘోరంగా వుండొచ్చు. పెళ్ళి చేసుకో మెల్ల మెల్లగా ఆ బాధని మర్చి పోవచ్చు"...

"నువ్వెన్ని చెప్పు జ్యోతీ! నా వల్ల కావటంలేదు" అతని కంఠం వేదనతో వణికింది.

ఇంతలో పక్కింటి కెళ్ళిన లలితమ్మ రానే వచ్చింది. ఆమెని చూస్తూనే భయంగా లేచి నిల్చున్నాడు. "ఏం నాయనా వచ్చావు?" వ్యంగ్యంగా అడిగింది.

"ఏం లేదండి, వనభోజనాల సంగతి గుర్తుచెయ్యమని సుబ్బారావుగారు చెబితేనూ"...

"అలాగా ఆయన సాయంత్రం వస్తారు. ఇప్పుడెళ్ళి అప్పుడురా...రా జ్యోతీ లోపలికి రా" అంటూ విసురుగా ఇంటిలోకెళ్ళి పోయింది. దీర్ఘంగా నిట్టూర్చి గుమ్మం వైపు కదిలాడు కళాధర్.

అతని అడుగుల చప్పుడు దూరమౌతుంటే జ్యోతి హృదయం నలిగిపోయింది. కాఫీ గ్లాసుతో వచ్చిన శారద అతను వెళ్ళిపోవటం చూసి బాధగా నిట్టూర్చింది.

శిలా ప్రతిమలా కూర్చున్న జ్యోతిర్మయి కళ్ళనుంచి నీళ్ళు అవిరళ ధారగా కారి పోతున్నాయి.

"జ్యోతీ ఏడుస్తున్నావామ్మా?" శారద చెల్లెలి తల మీద చేయివేసి ఆప్యాయంగా నిమిరింది.

"ఈ కళ్ళు పోకుండా నా ప్రాణాలు పోతే బావుండే

దక్కా" శారద చేతుల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చేసింది.

"ఎందుకే అంత మాటనుకుంటావు. ఏదో కళ్ళముందు ఇట్లాగయినా తిరుగు తున్నందుకు సంతోషిస్తున్నాను. అట్లాంటి మాటలని నా కడుపులో చిచ్చు పెట్టకు."

లలితమ్మ కూతురి నాస్థితిలో చూసి భోరుమంది.

ముగ్గురి హృదయాల్లో అంతులేని ఆవేదన! ఆరని అగ్ని. అలా కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ ఒకరి హృదయావేదన మరొకరు పంచు కుంటూ ఎంతసేపు కూర్చున్నారో!!

"శారదక్కా నా జాకెట్లు కుట్టేశావా?" అంటూ వచ్చింది పక్కింటి కమల. ఆ మాటలతో తేరుకుని లేచింది శారద.

"అయిపోయింది కమలా. హుక్స్ కుట్టి రేపిస్తాలే." అంది నవ్వటానికి ప్రయత్నిస్తూ. అదోలా వున్న శారద ముఖం చూసి ఇంకేం మాట్లాడ కుండా వెళ్ళిపోయింది కమల.

"జ్యోతీ! లేచి కొంచెంసేపు వీణ వాయించుకో కాస్త మనసు ప్రశాంతంగా వుంటుంది. ఇంకో వారం రోజుల్లో త్యాగరాజు ఆరాధనోత్సవాలు జరుగుతాయి. నీ ప్రోగ్రాం ఉండనే ఉంటుందామో...అంది చెల్లెల్ని ఆ మూడ్ నుంచి తప్పించాలని.

"ఎవరు చూసి సంతోషించాలక్కా. ఈ గుడ్డి బ్రతుకు ఎలా ముగిసిపోతే ఏం?" బాధగా విరక్తిగా అంది.

"అదుగో ఆ మాటే అనొద్దంటాను. నువ్విలా దిగు

లుగా బాధగావుంటే నాన్నగారిమనసు ఎంత క్షోభిస్తుందో తెలుసా? నా గురించీ, నీ గురించీ ఆయన ఆలోచించని క్షణం లేదు. నువు చక్కగా పాడుతూ, వీణ వాయిస్తుంటే నాన్నగారెంత మురిసి పోతారో తెలుసుగా, నా బంగారు తల్లిగా లేవాలి మరి" చెల్లెల్ని బుజ్జగించి లేపింది.

చాప వేసి, వీణ తెచ్చిపెట్టింది. చెల్లెలి చేయి పట్టి తీసుకువచ్చి వీణ ముందు కూర్చొబెట్టింది.

ఆ వేళ తీగలు తాకుతుండగనే జ్యోతి హృదయం అవ్యక్తమైన ఆనందంతో పులకించింది. అలవాటైన సన్నని వేళ్లు వీణ తీగలమీద చకా చకా కదిలి పోయాయి. కమ్మగా గొంతెత్తి త్యాగరాజ కృతి ఒకటి అందుకుంది.

లలితమ్మ కళ్ళనీళ్లు తుడుచుకుని కూతుళ్ళిద్దరి వంకా ఆనందంగా చూసింది. క్షణం క్రితం వరకూ విషాదతరంగాలు వ్యాపించిన ఆ ఇంట్లో సంగీత తరంగాలు మృదువుగా కదిలాయి, కాలేజి నుంచి వచ్చిన జానకి రామయ్య నిశ్శబ్దంగా వాలుకుర్చీలో పడుకుని ఆ గానామృతాన్ని ఆస్వాదిస్తూ ఉండి పోయారు.

# 3

ఆంధ్రప్రభకి పంపాల్సిన వ్యాసానికి తుదిమెరుగులు దిద్దేసి, రేపు క్లాసులో చెప్పబోయే పాఠాన్ని చూసుకుంటున్నారు జానకిరామయ్య. జ్యోతికి ఆముక్తమాల్యదలోని పద్యాలు చదివి వినిస్తోంది శారద. అనుక్షణం చెల్లెల్ని కంటికి రెప్పలా చూసుకోవటం, ఆమెకేం కావాలో అమర్చటం తనకి చూపు లేదనే సత్యాన్ని మరిచి పోయేలా చేయాలని శారద తాపత్రయం. నిజానికి శారదా, జ్యోతిర్మయికి రెండు కళ్ళు ఇద్దరూ ఒకర్ని విడిచి ఒకరు ఒక్క క్షణమైనా ఉండరు.

గడియారం తొమ్మిదిన్నర చూపుతోంది. సరస్వతి గుండెలమీద పుస్తకం పెట్టుకుని నిద్రపోతోంది. మంజుల కళ్ళు మూస్తూ తెరుస్తూ ఇంకా చదవాలనే ప్రయత్నిస్తున్నది.

గోదాదేవి విరహ ఘట్టం దగ్గర కొచ్చే సరికి శారద గొంతు దుఃఖంతో పూడుకు పోయింది. నీళ్ళు నిండిన కళ్ళకి అక్షరాలు సరిగా కనిపించటంలేదు. ఎంత అదిమి పెట్టినా దుఃఖం ఉబికి వస్తూనే ఉంది. "అక్కా! ఏడుస్తున్నావా?" జాలిగా అడిగింది జ్యోతిర్మయి.

ఇదంతా గమనిస్తున్న జానకి రామయ్య చూస్తూ ఊర్కో లేకపోయారు. దగ్గరగా వచ్చి శారద చేతిలో

పుస్తకం తీసుకుని మూసేశారు. పరిస్థితి అర్థమై పోయిన జ్యోతి నిశ్శబ్దంగా నడిచి వెళ్ళి తన పక్కమీద పడుకుంది.

శారద తండ్రి ఒడిలో తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చేసింది. "ఊర్కో శారదా, నా బంగారు తల్లి కదూ? నీకూ మంచిరోజులొస్తాయి. ఆ శుభోదయం కోసమే నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నానమ్మా"...ఆయన గొంతు గద్గదమై పోయింది. కన్నీళ్ళు జల జలా రాలి శారద తలమీద పడ్డాయి.

"మీరు ఏడుస్తున్నారా?" ఆశ్చర్యంగా చూసింది కన్నీళ్ళలో నుంచి.

"ఏం చేయను తల్లీ! ఈ రోజు బయట పడ్డాను గానీ, నీ భవిష్యత్తుని గురించి నేను బాధ పడని రోజు లేదు. నాకో దారి ఎప్పుడు చూపిస్తాడో ఆ దేవుడు. లే, లేచి పడుకో, మనసు చిక్క బట్టుకో"

శారద కన్నీళ్లు తుడిచి ఓదార్చి వెళ్ళి పడుకున్నారు. మంజులకి అప్పుడే కమ్ముకొస్తున్న నిద్రమత్తు కాస్తా వదిలి పోయింది. "అదేదో నవలలో రాసినట్లు అక్కకి మళ్ళీ పెళ్ళి చేస్తే ఎంత బావుంటుంది? అనుకుంది.

కళ్లు మూసుకున్నా ఆయన కంటికి నిద్ర రావటం లేదు. గుండెల్లో ఏదో ఆరాటం, ఏదో గుబులు ఏదో చెయ్యాలన్న తపన చేయలేని నిస్సహాయత.

లలితమ్మ భర్త వైపు తిరిగి "కంది పప్పు, కట్టెలు అయిపోయాయండీ" అంది.

“అప్పుడేనా?”

“అయిపోక ఏం చేస్తాయి చెప్పండి? చిన్న వదినవచ్చి వారం రోజులుండి పోయిందా? వారాలబ్బాయి ఇంకొకడు వస్తున్నాడా? పల్నాటినుంచి వచ్చిన కవులిద్దరూ మన ఇంటి లోనే మకాం పెట్టిరి? మీకివన్నీ కనిపించవు. అప్పుడే అయిపోయాయా? అంటారు అక్కడికి నేనేదో దుబారా చేస్తున్నట్లు”...నిష్ఠూరంగా అంది.

“అబ్బబ్బ! మొదలు పెట్టావూ? నేనేమన్నా నిప్పుడు? ఇంకా ఏమేం కావాలో అన్నీ రాసి తెప్పించు. అప్పిచ్చే వాడున్నాడుగా, ఆపద్బాంధవుడు. ఆ కొట్టులో ఎంత వున్నదో ఏమో? కవిగారన్న గౌరవం కొద్దీ ఎంత అప్పయినా లేదనడు. పోయిన నెల కూడా ఏం చెల్లు బెట్టలేదు” స్వగతంలా అనుకున్నారు.

“అవునులే ఎందాకని తెస్తాడు ఆయన మాత్రం?” మనసులోనే జాలిపడింది ఆమె భర్తమీద.

“నాన్నగారూ!” పుస్తకాలు సర్దేస్తూ మెల్లగా పిలిచింది మంజుల. “ఏం కావాలి?” కళ్ళమీద చేయి తీయకుండానే అడిగారు.

“రేపు నేనూ అక్కయ్యా ఫీజు కట్టాలి” అంది నెమ్మదిగా! “నాన్‌డిటైల్సు వచ్చాయట కొనుక్కోనా?”

“నాన్‌డిటయిల్సేగా, ఎవరైనా ఫ్రెండు దగ్గర చదువుకో!” మరేం మాట్లాడకుండా వెళ్ళి పడుకుంది మంజుల.

ఆలోచనలతో అలసిన ఆయనకి ఏ అర్ధరాత్రికో నిద్ర పట్టింది.

# 4

ఆ రోజు ఆదివారం సాయంత్రం మంజుల సినిమా ప్రోగ్రాం వేసింది. శారద నేనురాను జ్యోతికి తోడుగా వుంటాను అన్నా వినిపించుకోకుండా లాక్కెళ్ళారు. జ్యోతి కూడాఫరవాలేదక్కా అమ్మ వుంటుందిగా అని చెప్పటంతో కదలక తప్పలేదు శారదకి. అయినా మనసంతా చెల్లెలి మీదే వుంది.

శారద భర్త పోయిన దగ్గర్నుంచే, దాదాపు బయటికి రావటమే మానేసింది. సంతోషమంతా తమదే అన్నట్లు తిరిగే అందమైనజంటలు, చిన్నారి పాపలు, ఇలాటి దృశ్యాలని చూసినప్పుడల్లా ఆమె మనసు చలించి పోతుంది. ఊరికే వుంటే మనసు పాడైపోతుందని ప్రైవేటుగా భాషాప్రవీణకి కట్టించారు జానకిరామయ్య.

ఆదివారం వస్తే కాళిదాసు యింటిలో వుండడు. స్నేహితులు, షికార్లు, సినిమాలు. జానకిరామయ్య తను

రచించిన గ్రంథం పబ్లిష్ చేయించే విషయం మాట్లాడాలని పబ్లిషర్ దగ్గరకెళ్ళారు. అందరూ వెళ్ళిపోయాక జ్యోతికి ఏమీ తోచలేదు. ఎదురింటి పదేళ్ళ పద్మని పిలిచి చందమామ ఇచ్చి కథలు చదివి వినిపించమంది. పద్మకి జ్యోతి అంటే చాలా ఇష్టం. ఆమె ఏపని చెప్పినా నిమిషాల మీద చేసేస్తుంది.

"నీకు పద్మ తోడు ఉందిగా నేను రాజమ్మగారింటికెళ్ళనా?" లలితమ్మ కూతుర్ని అడిగింది. "వెళ్ళమ్మా." అంది జ్యోతి సాధారణంగా భర్త ఇంట్లో ఉంటే బయటికి కదలదామె. సినిమాలు చూడటం ఆమె కంతగా ఇష్టం ఉండదు ఏవైనా భక్తి రస ప్రధానమైన సినిమాలు వస్తే చూస్తుంది.

లలితమ్మ వెళ్ళి పదినిమిషాలయింది. "అక్కా! అమ్మ ఎందుకో పిలుస్తున్నది వెళ్ళిరానా?" అంది పద్మ తల్లి పిలుపు వినిపించి.

"ఆఁ వెళ్ళి త్వరగా రా పద్మా! నే నొక్కదాన్నే ఉంటాను" అంది బెదురుగా!

"ఇదుగో చిటికెలో రానూ?" అంటూ ఆ పిల్ల తూనీగలా బయటికి పరిగెత్తింది.

పద్మ వెళ్ళి అయిదు నిమిషాలయిందో లేదో మళ్ళీ అడుగుల చప్పుడు వినిపించింది.

"ఎవరూ? కళాధర్ నువ్వా?" విస్మయానందాలతో వణికిందామె గొంతు.

"నేనే జ్యోతి ఎలా గుర్తు పట్టావ్? గంటనుంచీ మీ వీధి చివరకాపలా కాస్తున్నాను అందరూ ఎప్పుడు వెళ్ళిపోతారా అని."

ఆ మాటలు వినగానే జ్యోతికోపం వచ్చింది.

"అందరూ ఉండగా రాకుండా ఇలా దొంగచాటుగా రావటం ఏం బావుంటుంది?...

"జ్యోతీ! అలా అనకు...నిన్ను ఒంటరిగా కలుసుకుని ఎన్నో విషయాలు మాట్లాడాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను నా అదృష్టం కొద్దీ..."

"కళాధర్ వెంటనే వెళ్ళిపో...ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు?"

"నేనెవర్నీ లెక్కచెయ్యను" పెంకెగా అన్నాడు.

"నాకు అందర్నీ లెక్కచెయ్యాల్సిన అవసరం ఉంది."

"నా వెనక పెద్దవాళ్ళు, అక్కలూ చెల్లెళ్ళు, ఇంటి పరువూ అన్నీ ఉన్నాయి" ఆవేశంలో ఆమె పెదవులు వణుకుతున్నాయి—

"అంటే నేనే పరువు లేనివాణ్ణనీ ఉద్దేశ్యమా? ఏమైనా అను జ్యోతీ! నే చెప్పదలుచుకుంది చెప్పి వెళతాను" అతని కంఠంలో ప్రశాంతత.

అతని మెత్తని స్వరం వింటున్న కొద్దీ జ్యోతికి బాధనిపించింది. తనే తొందర పడ్డానేమో అనుకుంది.

"ఏమనుకోకు కళా! నిన్నలాఅలాఅనాల్సొచ్చినందుకు నేనెంత బాధపడుతున్నానో... నీకు దూరంగా బ్రతకమని ఆ భగవంతుడు శిక్ష విధించినందుకు ఎంత కుమిలి పోతు న్నానో..."

"జ్యోతీ! నీ బాధ నాకు తెలుసు... మొన్న వన భోజనాలు జరిగిన రోజున నువ్వు పాడినపాట నీ ఆవేదన చూసి ఎంత కుంగి పోయానో తెలుసా? కళ్ళు మూసినా తెరిచినా సావిరహేతవ దీనా అంటూ పాడుతున్న నీ ముఖమే!"

"రామా! నీ దయరాదా అన్నీ నే ఆవేదనా పూరిత స్వరమే. నిన్ను కాదనుకుని మరో స్త్రీని నా జీవితంలోకి ఆహ్వానించలేను..."

"కళా! నీ మాటలు వింటుంటే... ఈ క్షణాన ఇలా నీ చేతుల్లో అంతిమ శ్వాస విడిచినా ఫరవాలేదని పిస్తుంది."

"ఛ! అవేం మాటలు?" ఆమె చేతుల్ని ఆప్యా యంగా తన చేత్తో నిమిరాడు. ఆ స్పర్శలో ఏదో వింత సందేశం ఆమె హృదయాన్ని పులకరింప చేసింది.

కొన్ని క్షణాల నిశ్శబ్దం అనంతరం మళ్ళీ అంది.

"ఈ గుడ్డిదాన్ని చేసుకుని ఏం సుఖపడతావ్?"

"నీ మనసుకి గుడ్డితనం లేదుగా జ్యోతీ! నువ్వు ధైర్యం చేశావంటే నిన్ను రహస్యంగా పెళ్ళి చేసుకుంటాను"

ఆ మాటలు మురళీ రవంలా వినిపించినా భయంతో వణికి పోయింది. "ఒద్దు కళా! మీ అమ్మా నాన్నలకి ఇష్టం లేకుండా పెళ్ళిచేసుకుంటే మనం ఏం సుఖ పడతాం?"

"ఒకవేళ పెళ్ళయినాక కళ్ళుపోతే ఏం చేసేవాళ్ళు"

"అంతా నా ఖర్మ! నాకు సరిగా బతికే యోగం ఉంటే ఈ కళ్ళు పోయేవి కావు. నాన్నగారికీ క్షోభా ఉండేది కాదు..."

"పోన్లే ఏదో జరిగింది. నీకు ఆపరేషన్ చేయిస్తే కళ్ళు వస్తాయని నాకు ఆశగా ఉంది..."

"అది జరగదు కళా! నాన్నగారి సంపాదనలో గం పంత సంసారం గడవటమే కష్టంగా ఉంది. వేలుపోసి నాకు ఆపరేషన్ చేయిస్తే, కళ్ళు వచ్చేను, రాకపోయేను...సరస్వతికి సంబంధాలు చూస్తున్నారు. ఒక్కటి కుదరటంలేదు..." నిరాశగా అంది.

"జ్యోతీ! నీకు ఆపరేషన్ నేను చేయిస్తాను. ఎంతఖర్చయినా నా దేవత కళ్ళల్లో ఆనందపు వెలుగులు నింపుతాను."

"పిచ్చి మాటలు—కోరిన కట్నం లేకుండా ఈగుడ్డి దాన్ని గడపతొక్కనిస్తుందా మీ అమ్మ—ఇవన్నీ జరిగేవి కావు— నన్ను కావాలనుకుని కోరి కష్టాలు తెచ్చుకుంటు న్నావు నువ్వు..."

“నువ్విలా అనకు జ్యోతీ. మన ప్రేమలో నాకు నమ్మకముంది. నిన్ను దక్కించుకుంటా ననే ఆశ ఉంది. నువ్వు మాత్రం నిరాశతో కుంగిపోవద్దు అదే నేను కోరుకునేది” స్నేహపూర్వకంగా ఆమె చేతిని మృదువుగా నొక్కి వదిలేశాడు.

“పదివేల కట్నంతో అందాలరాశి అయినఅమ్మాయి ఉన్న సంబంధం నీ కొస్తే నన్ను మర్చిపోవూ? ఈ మాటలు ఈ బాసలు శాశ్వతంగా నిలుస్తాయా?”

“జ్యోతీ, ఇదేనా నువ్వు నన్నర్థం చేసుకున్నది? అంత బలహీనుణ్ణయితే...నా ప్రేమఅంత తేలిగ్గా”అతనిగొంతులో కదిలిన బాధ ఆమెని కదిలించింది.

“సారీ, కళా ఏదో తమాష కన్నాను...ఇచ్చినమాట కోసం నిలబడే నీలాటి” అంటూ ఆగిపోయింది సిగ్గుగా.

“ఊఁ ఆగిపోయావేం చెప్పు” ఆమె చేతిని ఆవేశంగా నొక్కాడు.

“అహఁ ఏం లేదు” తడబడింది.

“ప్లీజ్, చెప్పు జ్యోతీ! నీ నోటివెంట ఆ మధురమైన మాట విని వెళ్ళిపోతాను ప్లీజ్” తన మొహాన్ని ఆమె మొహందగ్గర చేర్చి రహస్యంగా అడిగాడు.

“ఛీ!ఛీ! నాకు సిగ్గేస్తోంది” రెండు చేతులతో మొహం కప్పేసుకుంది.

"ఉహుం, అదేం కుదరదు చెప్పితీరాలి. వారం రోజులనుంచీ కంటిమీద కునుకు లేదు. నువ్వా మాటచెపితే ఈ రోజు హాయిగా నిద్రపోతాను"

ఆమె చుబుకాన్ని పట్టుకుని బ్రతిమాలుతున్నాడు. అతని వళ్ళంతా చెవులు చేసుకున్నాడు ఆ మాటలు వినటం కోసం ఇంతలో చెప్పులు విడిచిన శబ్దమయింది.

"నాన్నగారు వచ్చినట్లున్నారు" కంగారుగా లేచి నిల్చుంది.

త్రుళ్ళిపడి చూశాడు కళాధర్. ఎదురుగా జానకి రామయ్య ఆరడుగుల మనిషి! ఆ మొహంలో ఏ భావా లున్నాయో? అతని గుండె దడ దడ లాడింది.

జ్యోతికి ముచ్చెమటలు పోస్తున్నాయి. తడబడే అడు గులతో తడుముకుంటూ లోపలికెళ్ళిపోయింది. గుండెల్లో లావా పొంగుతోంది.

"ఎంతసేపయిందోయ్ నువ్వొచ్చి" తాపీగా వాలు కుర్చీలో కూర్చుంటూ అడిగారు.

ఆ శాంత స్వరం విని అదిరిపోయాడతను తుఫాను ముందరి ప్రశాంతత కాబోలనుకున్నాడు.

"ఏవన్నా సంబంధాలు చూస్తున్నారటోయ్?" మళ్ళీ

తాపీగా ప్రశ్నించారు అతని మొహంలోకి చూడకుండా చేతిలోని పుస్తకం తిరగేస్తూ.

"ఎవరికండీ?" తెల్లబోయా డతను.

"నీకేనోయ్, లేకపోతే నాకా? భలేవాడివే మొత్తానికి" ఆ నవ్వు అతనికి పదునైన ముళ్ళకత్తితో గుండెలో గుచ్చినట్లయింది.

సమాధానం చెప్పకుండా గుటకలు మింగుతూ వుండిపోయాడు.

"ఉద్యోగ ప్రయత్నా లెంతవరకు వచ్చినయ్"

"తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నాం"అంటూ గుమ్మం వైపు అడుగులేశాడు.

"ఇంటికేనా?"

"ఊఁ" అని సమాధాన మిచ్చాడు ఎవరో తరుముకొస్తున్నట్లు.

"శంకరాన్ని ఒకసారి నే రమ్మన్నానని చెప్తావా?"

అలాగే అంటూ తలూపి ఒక క్షణం నిలవకుండా వెళ్ళిపోయాడు కంగారుగా.

లలితమ్మ హడావిడిగా లోపలికొచ్చింది. "ఇత నెప్పు

డొచ్చాడు? మీరొచ్చి ఎంతసేపయింది" కంగారుగా అంది. దొరికి పోయిన దొంగలా ఉంది ఆమె పరిస్థితి.

"అతనెప్పుడొచ్చాడో నీకే తెలియాలి? గుడ్డిపిల్లని యింట్లో ఉంచి పోయావు పెత్తనాలకి. ఎవరన్నా వచ్చి యిల్లు దోచుకుపోయినా ఇంతేనన్నమాట"

"ఇప్పుడేనండీ నేను వెళ్ళింది! కాంతమ్మ పిన్ని మరీ రమ్మని గొడవచేస్తుంటేనూ-"

"అఘోరించలేకపోయావ్, కళ్ళు కనిపించని పిల్ల ఇంట్లో ఒక్కతే ఉంటుందన్న జ్ఞానం లేదు నీకు. ఎవడన్నా ఇంట్లో దూరి ఆ పిల్లని ఏం చేసిపోయినా దిక్కులేదన్న మాట..."

తండ్రి మాటలు గునపాల్లా గుచ్చుకుంటున్నాయి జ్యోతి గుండెల్లోకి.

మామూలుగా యెంత ప్రశాంతంగా ఉంటాడో కోపంవస్తే మాత్రం ఆయన్నిపట్టుకోలేం. దుర్వాసుడుకూడా తలవంచాల్సిందే ఆయనముందు.

# 5

వెలుగు రేఖలు జగత్తునంతటినీ పరుచుకుంటున్నాయి. 'హరిలో రంగ హరీ' అంటూ హరిదాసులు పాడే కీర్తనలూ మనోహరంగా వినిపిస్తున్నాయి. వాకిళ్ళు ఊడుస్తూ ఒకరితో ఒకరు పోటీలు పడుతూ ముగ్గులు వేస్తూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు ఆడవారు. సంక్రాంతి రోజుల్లో సంబరమంతా ఉషోదయంతోనే ప్రారంభమౌతుంది.

శారద లేచి తలార స్నానంచేసి, దేవుడిముందు కూర్చుని సుందరకాండ పారాయణ చేస్తోంది. అక్కపక్కన కూర్చుని శ్రద్ధగా వింటున్నది జ్యోతి. సాధ్యమయినంతవరకు శారద మనసు ప్రశాంతంగా ఉంచాలని ఆమె మనసు భక్తి మార్గం వైపు మళ్ళించాడు తండ్రి.

సరస్వతి లేచి వాకిలి ఊడుస్తుంటే మంజుల దొడ్లో అంట్లు తోముతున్నది. జానకిరామయ్య లేచి పక్కకి తిరిగి చూశారు లలితమ్మ హాయిగా నిద్రపోతోంది. ఆడపిల్లలతల్లి

మరి! చేతికందిన ఆడపిల్లలు యింట్లో ఉంటే తల్లికి సుఖం. సంపాదించే కుమారుడుంటే తండ్రికి సుఖం. ఆయన చిన్నగా నిట్టూర్చి ధ్యానం చేసుకోవాలని ప్రయత్నించారు కానీ—

ఎంత సేపటికీ ఏకాగ్రత కుదరలేదు. నిన్నటి సంఘటన ఆయన మనసులో పదే పదే మెదులుతున్నది. అన్ని లక్షణాలు ఉంటేనే ఈ రోజులలో ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు కావటమే కష్టంగా ఉంది. యీ గుడ్డిపిల్లనెవరు చేసుకుంటారు? కళాధర్‌కి చేసుకోవాలనే ఉంది మనసులో. తల్లిదండ్రులు సాగనివ్వొద్దూ? అతనిలా ఇంటికి రాక పోకలు సాగిస్తూ జ్యోతితో పరిచయం పెంచుకుంటే లోకులేమనుకుంటారు? కూతుర్ని మాత్రం ఏ మని మందలిస్తాడు? ఆయనకి మనసంతా గజిబిజిగా తయారయింది. కీకారణ్యంలో దారీ తెన్నూ తెలియక నడిచిపోయే పాంథుడిలాగా తయారయింది ఆయన పరిస్థితి.

ఆయన ఆలోచనల్లో ఉండగానే లలితమ్మ లేచి పొయిరాజేసి నీళ్ళకాగు వేసింది. చలి విపరీతంగా ఉండటంతో కొంగు భుజాలచుట్టూ కప్పుకుని పొయ్యి దగ్గర చలి కాచుకుంటున్నది. ఏటా కాన్పులతో, ఇంటెడు చాకిరితో ఆమెలో ఓపిక సన్నగిల్లింది. శారద, జ్యోతి సాధ్యమయినంత వరకు పనులు చేసుకుంటూ పోతుంటారు. కళ్ళు కనిపించక పోయినా జ్యోతికి ఏ వస్తువు ఎక్కడుందో, ఏ పని ఎలా చేయాలో, ఏ గదిలోకి ఎలా నడిచి వెళ్ళాలో ఆమెకి బాగా తెలుసు.

"వసూ! త్వరగా లే చిట్టెమ్మగారింటికెళ్ళి ఆవు పేడ తీసుకురా. ఎదురింటి పద్మవచ్చి పిలుస్తున్నది లే! ఆలస్యంగా వెళితే అయిపోతుంది. మనింటిముందు గొబ్బెమ్మలుండవు" అంట్లు తోమేసి వచ్చి చెల్లెల్ని లేపటానికి తంటాలు పడుతున్నది మంజుల.

"ఇప్పుడే చలిలో ఆ పసిదాన్ని పేడకోసం ఏం పంపిస్తావులే వూరుకో" తండ్రికంఠం విని ఆగిపోయిందా పిల్ల ఆయన మొహం కడుక్కోటానికి దొడ్లోకెళ్ళగానే "వసూ! లే, లే, తొందరగా" అంటూ తొందర పెడుతోంది చెల్లెలిని రహస్యంగా.

వాకిట్లో ముగ్గేసి లోపలికొచ్చింది సరస్వతి. "పిళ్ళకసలు ఇంట్రస్టు లేదే! మనిద్దరం నాలుగింటికే లేచి ఎంత దూరం పొయ్యేవాళ్ళం ఆవుపేడకోసం గోసంరక్షణ శాల, రత్నాటాకీసు పక్కన కోమట్లఇల్లు విమలా వాళ్ళిల్లు."

"చిట్టెమ్మగారింట్లో ఆ వీధిలో వారి ఇల్లు" అందుకుంది సరస్వతి.

"రోజుకి పాతిక గొబ్బెమ్మలు చేసేవాళ్ళం. ఇప్పుడు శాస్త్రార్థం రెండు చేద్దామన్నా ఈ మొద్దు లేవనే లేపదు: ఎంత సేపటికీ." చెల్లెలిమీద విసుక్కున్నారిద్దరూ వసుంధర లేచే సూచనలేమీ కనిపించలేదు.

"మంజూ నువ్వుపోయి తీసుకురావే—చిట్టెమ్మగారిల్లు దగ్గరేగా... వాకిట్లో ఎంతపెద్ద ముగ్గేశానో... గొబ్బిళ్ళు లేకపోతే బోసి పోతుంది."

"నాన్నగారు చూస్తే..." భయంగా అక్క వంక చూసింది మంజుల.

"నే చూసుకుంటాగా...నువ్వు దొడ్డివాకిటనుంచిపో" భరోసా ఇచ్చింది.

"సరే పోతాగానీ...నేను వచ్చి పిలవగానే తలుపు తియ్యాలి...ఆలస్యం చేస్తే అన్నయ్య చూస్తే చంపేస్తాడు" భయంగానే అంటూ వెళ్ళింది.

సరస్వతి దొడ్డి కూడా శుభ్రంచేసి నీళ్ళు చల్లి అందంగా రంగవల్లి తీర్చింది. బంతిపూలుకోసి ముగ్గుమధ్యలో పసుపు కుంకుమ వేసి పూలరేకులు చల్లింది. గొబ్బెమ్మల కొక్కవాలిసినవన్నీ సిద్ధంచేసి చెల్లెలి కోసం ఎదురుచూస్తోంది. కాళిదాసు దొడ్లోకొచ్చి "నా టూత్ పేస్టు బ్రష్ తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.

ఇంతమంది ఆడపిల్లల మధ్య ఒక్కడు గాబట్టి అతనో రాజకుమారుడా ఇంట్లో. కాలేజీలో బి. ఏ. చదువుతున్నాడు.

మనసులో విసుక్కుంటూనే లోపలికెళ్ళింది సరస్వతి చెల్లెలు ఏ క్షణాన వచ్చేస్తుందో అని మనసు పీకుతోంది. పేస్టు వేసి బ్రష్ అన్నగారిచేతికిచ్చి పక్కలెత్తుతుంది. వసుధ మెల్లిగా లేచింది "అక్కా! ఆవుపేడ కెళ్ళేదా" అంది రహస్యంగా దగ్గరగా వచ్చి. "త్వరగా వెళ్ళు! ఇంకా వెళ్ళేదా అనే దాన్లోనే ఉన్నావు. మంజు అక్కడే ఉంది-నీవు పోయి దాన్ని పంపించు" వసుధ ఎగురుకుంటూ వెళ్ళిపోయింది.

ఇల్లిల్లు పేడకోసం తిరగటం ఇష్టం ఉండదు తండ్రికి. అలా తిరక్కపోతే తోచదు పిల్లలకి. అందుకే రహస్యంగా వార్త లందించుకుంటారు అక్కచెల్లెళ్ళు.

"మంజూ!" అన్న తండ్రి పిలుపు విని దగ్గరకెళ్ళింది సరస్వతి. "మంజు లెట్రిన్ కెళ్ళింది ఏం కావాలి?" అంది తడబడుతూ. "ఆ పేపరు ఇటిచ్చి వెళ్ళు" పేపరిచ్చి వచ్చేస్తుంటే మళ్ళీ పిలిచాడు "పేపరిచ్చిన దానివి కళ్ళజోడివ్వాలని తెలియదూ?" సరస్వతి అదిరిపడింది. కళ్ళజోడు తండ్రికందించి దొడ్డివాకిలి దగ్గరకొచ్చింది.

మంజుల రానేవచ్చింది చేతిలో వాలీబాల్ సైజులో ఉన్న పేడముద్దతో. "ఎంతసేపట్నుంచి అరుస్తున్నా తలుపు తీయవే?" అక్కమీద విసుక్కుంటూ లోపలికి నడిచింది.

"అప్పుడే తెల్లారిందే పేడేసుకు రావటానికి" కాళిదాసు కోపంగా అరిచాడు. సరస్వతి మాట్లాడకుండా గొబ్బెమ్మలు చేస్తుంది. మంజుల పంపువగ్గర కెళ్ళి చేతులు కడిగేసుకుంది.

"శ్రద్ధగా చదువుకోటం లేదుగానీ ఇళ్ళంబడి తిరిగి చెత్తపోగేసుకొస్తారు." గొణుక్కుంటూ లోపలికెళ్ళాడు.

"వసూని విమలావాళ్ళింటికి పంపించా, అది కూడా తెస్తుంది. బోలెడుగొబ్బెమ్మలవుతాయివ్వాళ" సంతోషంగా ఆ పిల్ల కళ్ళు మెరిసిపోతున్నాయి.

"అమ్మా! దొడ్లోఎంతచక్కనిముగ్గేశానోచూశావా" సంతోషంగా తల్లివంకచూసింది సరస్వతి.

"చక్కగా ఉందే...యీ మొద్దుమొహానికేమీ రావు. రేపు పోయినచోట ఎట్లా చేస్తుందోగాని" పూలు కోస్తున్న మంజుల మొహం ముడుచుకు పోయింది.

"పోవే! నీ కెప్పుడూ పెళ్ళి గొడవే! నేనసలు పెళ్ళి చేసుకోను" విసురుగా వెళ్ళబోయి ఎదురుగా తండ్రిని చూసి ఆగిపోయింది. ఆయన టవల్ చుట్టుకుని వస్తున్నారు. అంటే స్నానానికి నీళ్ళుతోడాలన్నమాట. మవునంగా ఆ పనిలో మునిగిపోయింది.

స్నానానంతరం జపం చేసుకుంటూ కూర్చున్నారు. శారద లేచి తల్లికి వంటపనిలో సాయం చేస్తుంది. జ్యోతి లేచి గదిలోకెళ్ళి కూర్చుంది. "భగవాన్! ఏ పనికీ కొరకాకుండా నన్నెందుకిలా చేశావ్? యీ చూపు తీసుకునే బదులు నా ప్రాణాలు తీసుకుంటే ఎంత బాగుండేది? నా అంధకార జీవితంలో వెలుగేది? కళాధర్ అన్నంతపనీ చేస్తాడా? అతని మాటల్లో విశ్వాసం, ఆ స్వరంలో నిండుగా తొణికిసలాడుతున్న అనురాగం, పదే పదే తనని కలవాలని తపించే అతని హృదయం, ఎలా మరచి పోవటం?" ఆ పిల్ల మనసులో ఆవేదన కంతులేకుండా పోయింది.

"అన్నయ్యా! నీ పెన్నొకసారియ్యవూ?" కాళిదాసు దగ్గరకొచ్చి నెమ్మదిగా అడిగింది సరస్వతి. "నీ పెన్నుతో రాస్కో పో" విసుక్కున్నాడు. "సిరాఅయిపోయింది ఒక్కసారివ్వవా? మళ్ళీ బ్రతిమాలింది." "సిరా పోసుకుని రాసుకో!" కోపంగా చూశాడు చెల్లివంక.

"ఎప్పుడూ ఇంతే తన పెన్ను ఒక్కసారి కూడా ఇవ్వడు. అరిగిపోతుందేమో!" అక్కసుగా అనుకుంటూ మంజుల నడిగి పెన్ను తీసుకుని నోట్సు రాసుకుంది.

"నీ పెన్నేమయిందక్కా?" హఠాత్తుగా గుర్తుకొచ్చి అడిగింది మంజుల.

"నాన్నగారితో చెప్పకే! నా పెన్నుపాళీ మా క్లాసు వాణి విరగ్గొట్టేసింది" జాలిగా చూసింది.

"కొత్త పాళీ వేయించమని అడగక పోయావా?"

"ఎట్లా అడిగేదే? వాళ్ళనాన్న అసలే చండశాసనుడు. దాని ఏడుపు మొహం చూస్తే జాలేసింది నాకు."

"సరే నాకెందుకులే. నువ్వుమాత్రం ఎలా రాసుకుంటావు?" అనుకుంటూ చదువుకోవటంలో మునిగి పోయింది.

"అదా సంగతి! నాన్నగారితో చెబుతానుండండి. పెన్నులన్నీ ఇట్లా పాడు చేస్తున్నారా?" కోపంతో అరిచాడు కాళిదాసు.

సరస్వతికి గుండె గుభేలుమంది. అన్నయ్య నాన్నగారితో చెప్పకుండా ఊరుకోడు. ఆ పిల్ల కళ్ళు శ్రావణ మేఘాలయ్యాయి. మంజుల మనసు కరిగిపోయింది. "చెప్పొద్దులే అన్నయ్యా! అక్కయ్యేడుస్తున్నది చూడు."

"నా కెందుకొచ్చిన గోల చెప్పన్లే!" అని వెళ్ళి పోయాడు.

తొమ్మిదిన్నర వరకు సందడిగా వుంటుందా ఇల్లు! కాలేజికి పోయేవాళ్ళ తొందర. స్కూల్‌కెళ్ళేవాళ్ళ హడావిడి.

స్నానాలు ముగించి తల దువ్వుకుందామని, కొబ్బరి నూనెసీసావైపు చూశారు అక్కచెల్లెళ్ళిద్దరూ, అది ఖాళీగా వెక్కిరించింది. ఒత్తయిన జుట్టు నూనె లేకపోతే ఒకపట్టాన వంగదు. పౌడరు కూడా అయిపోయిందే!" దిగాలుగా చూసింది మంజుల. ఆ పిల్లకి అలంకరణ పట్ల మోజెక్కువ. "ఎట్లా ఉంటే ఏంలే?" అనుకునే తత్వం సరస్వతిది.

మంజుల జడ వేసుకుని బొట్టు పెట్టుకుంటుంటే అన్న గారి అరుపులు వినిపించాయి. "కొబ్బరినూనె, పౌడరు అన్నీ ఖాళీ! బ్రహ్మ రాక్షసులైపోయారు. ఏదీ బతకనివ్వరు ఇంట్లో"—చెల్లెళ్ళమీద విరుచుకు పడ్డాడు కాళిదాసు.

వంటింట్లోకొచ్చి, అమ్మా అన్నం పెట్టు. టైమవుతుంది" అని కేకపెట్టాడు విసురుగా అతడి కోపానికి ఇంట్లో అందరు హడిలి పోతుంటారు. శారద గబగబా వచ్చి పీటవాల్చి, మంచినీళ్ళు పెట్టి, అన్నం వడ్డించింది. వేడివేడిఅన్నం సెగలు కక్కుతున్నది. "సరస్వతీ! విసనకర్ర తీసుకురా!" అరిచాడు మళ్ళీ.

ఆపిల్ల అల్లుకుంటున్న జడ సగంలో వదిలేసి విసనకర్ర కోసం గాభరాగా ఇల్లు నాలుగు మూలలా వెదికింది. కని పిస్తేగా ఓ పట్టాన సమయానికి ఏవస్తువు కనిపించదు. ఆపిల్ల

వెదకుతుండగానే జ్యోతి విసనకర్ర తెచ్చి ఇచ్చింది. "మీకు కళ్ళు ఉన్నా ఒకటే దానికి లేకపోయినా ఒకటే" కంచాలు పెట్టుకుంటున్న చెల్లెళ్ళవంక చురుగ్గా చూశాడు కాళిదాసు.

"అన్నయ్యా! వాళ్ళనెందుకట్లా విసుక్కుంటావు నేను అనుభవిస్తున్న రభస చాలదూ?" జ్యోతి బాధగా అంది "నిన్నన్లేదమ్మా! రానురాను వీళ్ళు సోమరిపోతులై పోతున్నారు అందుకని" తనను తను సమర్థించుకుంటున్నాడు.

సరస్వతి స్పెషల్ ఫీజు కట్టాలి. మంజుల రికార్డుకి డబ్బుకట్టాలి. కాళిదాసు నోట్సు కొనుక్కోవాలి. ముగ్గురికీ డబ్బులిచ్చేసి పర్సులోకి చూసుకుంటే కొద్ది చిల్లరమాత్రమే మిగిలింది.

అందరూ వెళ్ళిపోయాక అలసటగా కుర్చీలో వాలిపోయారు. ఎటు చూసినా సమస్యలు. ఈసమస్యల చట్రంలో గట్టిగా బిగించబడ్డాడు తను. ఉస్సురని నిట్టూరుస్తూ గడియారం వంక చూశారు. తొమ్మిదిన్నర దాటిపోయింది.

గబగబా లేచి వంటింట్లోకి వచ్చారు. అప్పటికే భోజనం వడ్డించి ఎదురు చూస్తోంది ఇల్లాలు.

"మా నాన్నకి వంట్లో బాగాలేదుట. వెళ్ళి చూసొస్తాను" నెయ్యి వడ్డిస్తూ ఆశగా భర్త ముఖంలోకి చూసింది.

"వెళ్ళుదువుగానిలే, కాస్త ఓపిక పట్టు. నువ్వుకూడా తొందర చేస్తే ఎట్లా?"

"అడగగానే ఎప్పుడు పంపించారులే!"అనుకుందామె మనసులోనే.

"ఇంతమంది కోర్కెలు తీర్చాల్సినవాణ్ని నేనొక్కణ్ని కాస్త నాసంగతికూడా ఆలోచించండిమరి?" భోజనంపూర్తి చేసి, చేతులు టవలుకు తుడుచుకుంటూ భార్యవంక చూశారు.

"సర్లెండి! నేనుమాత్రం ఇప్పుడే వెళ్ళి తీరాలంటు న్నానా? ముందుగా చెప్పి ఉంచితేకదా మీకు దయకలి గేది?" అందామె వంటిల్లు సర్దుతూ.

"ఇవాళ కార్డు రాయిస్తాలే! ఆయన్నేవచ్చి పది రోజులుండిపొమ్మని."

"సరే మీ ఇష్టం, వడ్లు మరకేయించాలి. ఇవాళపని వాళ్ళని రమ్మని చెప్పాను" అంది బియ్యం అయిపోయినయ్యని గుర్తుచేస్తూ.

"సావిత్రమ్మగారి నడిగి అయిదు రూపాయలు అప్పు తీస్తుకో. పత్రికలవాళ్ళుడబ్బుపంపుతారేమోనని చూస్తున్నా సత్తెనపల్లినుంచి ఇంటిఅద్దె రావటంలా రెణ్ణెల్లనుంచి. నాకిచ్చే వాళ్ళెవరూ సరిగా ఇవ్వరు. నేనివ్వాల్సిన వాళ్ళు మాత్రం కరెక్టుగా వసూలు చేస్తుంటారు" దీర్ఘమైన నిట్టూర్పు వెలు వడింది.

"సరే...అది మన జాతక ఫలం"...బాధగా గొణు క్కుంది.

# 6

స్కూలునుంచి వచ్చిన మంజుల సరస్వతి హాల్లో కుర్చీలో కూర్చున్న వ్యక్తిని చూసి సంతోషం పట్టలేక పోయారు. సరస్వతి తలవంచుకుని మెల్లగా లోపలికెళ్ళి పోయింది. మంజుల మాత్రం "హాయ్ బావా? అత్తయ్యా వాళ్ళంతా కులాసా యేనా?"

"ఆహాఁ" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"బావా, నిన్ను చూసినప్పుడల్లా బావా - బావా పన్నీరు బావను పట్టుకు తన్నేరు అనాలనిపిస్తుంది... కాని ఏం లాభం? నువు మా అక్కల్లో ఒక్కర్నయినా పెళ్ళి చేసుకోలేదు."

"పోనీ నిన్ను చేసుకుంటాలే... రోజూ తంతూ ఆ పాట పాడుదువుగాని" చిలిపిగా నవ్వాడు కృష్ణమోహన్.

"ఛీ ఛో! నే నసలు పెళ్ళే చేసుకోను... చేసుకున్నా నీలాంటి నల్లటివాడ్ని మాత్రం ఛస్తే చేసుకోను"

"సర్లే అలాగే అంటుండు...అసలు ఎర్రటమ్మాయి లందరికీ నల్లటి మొగుళ్ళు, నల్లటబ్బాయిలకి తెల్లటిపెళ్ళాలు ఆ భగవంతుడు యెప్పుడో రిజర్వు చేసి ఉంచేశాట్ట తెలుసా నీకు" చిత్రంగా నవ్వాడు.

"ఆఁ ఏంకాదు. చూస్కో బావా నేను మాత్రం నల్లటివాడ్ని పద్మనయనంబుల వాడయినా చేసుకోను"

"నీ వలపు ధనం కొల్లకొట్టినా చేసుకోవా?"

మంజుల ఏదో అనబోయేంతలో లలితమ్మ రానే వచ్చింది లోపల్నుంచి చేతిలో కాఫీగ్లాసుతో.

"ఏవిటే బావతో నీ పరాచికాలు?"

"పోన్లే అత్తయ్యా బావనే కదా...అయినా ఆడ పిల్లలు ఆ మాత్రం చురుగ్గా ఉండకపోతే యేం బాపుం-టుంది?"



"ఏం చురుకుదనమో ఏమోరా నాయనా, ఇది చూడబోతే వాగుడుపిట్ట అది చూద్దామా—నోట్లోమాటే రాదు" కాఫీగ్లాసు అల్లుడి కందించి యెదురుగా నేలమీద కూర్చుంది.

జానకిరామయ్య పెద్దమ్మ కూతురు కొడుకు కృష్ణ మోహన్. అతనిదీ శారదదీ ఒకే ఈడే. ఇంతమంది ఆడ పిల్లలున్నారు ఒకర్నయినా అతనికిచ్చి చేద్దామనుకుంటే అదేం చిత్రమో ఎప్పుడూ కుదరనేలేదు. అతనికి మాత్రం

శారదంటే ఆరాధనా భావం. ఆ భావం ఏనాడూ చెక్కు చెదరలేదు.

లలితమ్మ తీరిగ్గా కూర్చుని ఆ కబురూ యీ కబురూ చెప్తోంది గానీ అతని మనసిక్కడ లేదు. శారదకోసం నాలుగు వైపులా వెదుకుతున్నాయి. చివరికి ఉండబట్టలేక అడిగేశాడు. "శారద కనిపించదేం అత్తయ్యా!"

"డాబామీద చదువుకుంటున్నది. దానికి బ్రతుకు తెరువు అంటూ ఉండాలిగా...అందుకే ఏదో సంస్కృతం పరీక్షకు కట్టించారు" అంది విచారంగా.

"జ్యోతి కళ్లు—ఏదన్నా ఆపరేషను చేయిస్తే వస్తాయేమో చూపించలేదా?"

"స్తోమత తెలీందేముంది కృష్ణా, ఇంత సంసారం ఆయనొక్కడే యీడ్చుకురావాలి. ఎవరూ అండలేరు"

దీర్ఘంగా నిట్టూర్పు విడటం తప్ప మరేం చెయ్యలేక పోయాడు. "నేను వంటచేసుకోవాలి. నువ్వు కూర్చో మీ మామయ్య యీలోగా రానే వస్తారు" అంటూ వంటింట్లో కెళ్ళిపోయిందామె.

కృష్ణమోహన్ మెల్లగా డాబామీదకి చేరాడు. శారద కౌముదిలోని సూత్రాలు వల్లెవేస్తున్నది: జ్యోతి అక్క ఒడిలో పడుకుని ఏవో అందని వాటిని ఊహల్లో అందుకుని వ్యర్థ ప్రయత్నం చేస్తున్నది.

అడుగుల చప్పుడు వినిపించగానే దిగ్గున లేచి కూర్చు

న్నది. "ఎవరది? బావా నువ్వా?" అంది సంతోషంగా.

అంతకుముందే మంజుల వచ్చి చెప్పివెళ్ళింది బావ వచ్చాడని.

"నేనే జ్యోతీ, నీ ఆరోగ్యం బావుంటున్నదా?"

"ఆరోగ్యానికేం బావా, అత్తయ్యా, సుమతీఅందరూ బావున్నారా?" సుమతి కృష్ణమోహన్ చెల్లెలు.

"బావున్నారు జ్యోతీ, అమ్మకూడా రావాలనుకున్నది మిమ్మల్ని చూసి చాన్నాళ్ళయిందని. నాయనమ్మకి వంట్లో బాగాలేదు. ఆమెతో ఒకగోల బ్రతికిఉంటే ఇంట్లో అందర్నీ చంపుకుతింటున్నది"

"వంద సంవత్సరాలు దాటిపోయినా ఆమె యింకా బతికున్నదంటే ఎంత ఆశ్చర్యంగా ఉంటుందో"

"ఏం శారదా, నువ్వేం మాట్లాడటంలేదు" హఠాత్తుగా శారదవైపు తిరిగి అడిగాడు.

"ఏదీ...నేనే మాట్లాడుతున్నానుగా, బావా నాకు కొంచెం పనుంది కిందకి వెళుతున్నాను. నువ్వు అక్కయ్యా మాట్లాడుతుండండి" సమాధానంకోసం యెదురు చూడకుండా నెమ్మదిగా మెట్లుదిగసాగింది.

ఆమె పూర్తిగా మెట్లన్నీ దిగిపోయేవరకూ చూస్తూ ఉండి వెనుదిరిగివచ్చి శారద ఎదురుగా కూర్చున్నాడు.

"ఎంత మామూలుగా దిగిపోయింది! తన పనులన్నీ తనే చేసుకుంటుందా శారదా?"

"అన్నిపనులు చేస్తుంది బావా, ఒక్క వంటతప్ప. దానికి పుస్తకాలిచ్చి అవి చదివించుకోటానికి మాత్రం అందర్నీ బతిమాలుతుంది. నాన్నగారు కావ్యాలు మంజుల నవలలు చిన్నది చందమామలు, ఇహ వీళ్ళందరూ వెళ్ళి పోయాక నన్నుమాత్రం వదిలిపెట్టదు" బాధగా నవ్వింది.

"ఎంత దురదృష్టం శారదా, స్వేచ్ఛగా ఎగిరే పిట్టని పంజరంలో బంధించినట్లు వెన్నెలని గుప్పిటతో మూసినట్లు, నిజంగా దేవుడు ఎంత దయలేనివాడు. మామయ్య యిన్ని అగ్నిపర్వతాలని గుండెలలో యెలా దాచుకుంటు న్నాడో..."

"అందరూ సానుభూతి చూపించేవారే ఒక చేయి అందిద్దామని ఎవరూ అనుకోరు"

అనుకోకుండా వచ్చిన ఈ నిందకి ఏ సమాధానమూ చెప్పలేకపోయాడు కృష్ణమోహన్.

శారదకి తన మనసేవిటో అర్థంగాకుండా పోయింది. భర్త మరణం అకాలంలో మీద విరుచుకుపడిన వైధవ్యం ఆమె మనసులో అప్పుడప్పుడు కృష్ణమోహను రూపం తొంగిచూడకపోలేదు. ఈ సమాజపు వత్తిడులు సాంఘిక నియమాలు సంప్రదాయపు సంకెళ్ళు ఆమె మనసుని వికసించనీయలేదు. ఈ రోజు ఎదురుగా అతను ఏదో మాట్లాడా

ఒని మనసు తొందర చేస్తోంది. వివేకం వద్దని హెచ్చ
రిస్తోంది.

"ఆయన పోయి రెండు సంవత్సరాలపైనే అయింది. ఒక్కసారయినా నీకు నన్ను చూడాలనిపించలేదా" హఠా త్తుగా అడిగింది.

"నిజం చెప్పమంటావా శారదా," దీర్ఘంగా నిట్టూర్చి మొదలుపెట్టాడు.

"ప్రేమ పెళ్ళి అనే పదాలకి అర్థం తెలీయని వయ సులో నీకు పెళ్ళయిపోయింది. అదేవిటో నేను తెలుసుకునే లోగా, నేను కోరుకున్న హృదయం, నా నుంచి దూరమై పోయిందని తెలుసుకున్నాను. చిన్నప్పట్నుంచీ నీమీదో క విధమైన అభిమానం, ఆప్యాయత పెంచుకున్నాను. అది అను రాగం అని నాకు నేను తెల్సుకునేప్పటికి నువ్వొమరొకరిదాని వయిపోయావ్"—అతని భావోద్వేగం ఆమెకి వింతగా అని పించింది.

"ఏవిటి బావా నువు మాట్లాడేది?"

"అవును శారదా నీకు కొత్తగా ఉండొచ్చుగానీ ఇన్నేళ్ళుగా నా మనసులో జరుగుతున్న సంఘర్షణ ఇది. అందుకే ఎన్ని సంబంధాలొచ్చినా తిప్పి కొట్టేశాను. అదే విటో నిన్ను తప్ప; మరే అమ్మాయిని చూసినా నా హృద యం పులకరించదు, నా ఎడద ఆనందంతో ఎగిసి పడదు. . నీ పేరు అనుకున్నా నీ రూపు తలుచుకున్నా మనసంతా వెన్నెల కురిసినట్లుంది."

"నాలో ఈమార్పు నాకే అర్థం కాలేదు. అందుకే నీ రూపం మానంగా ఆరాధించుకుంటున్నాను. నీకీ స్థితి పట్టిందని తెలిసి, మనసులోనే కుమిలిపోయాను. అపర శారదా మూర్తిలా ఉండే నిన్ను ఇలా కళావిహీనంగా చూడలేకే ఇన్నాళ్ళు ఈ ఇంటిగడప తొక్కలేదు. ఎందుకో ఈ రోజు మాత్రం నిగ్రహించుకోలేక పోయాను..."

అతని వేదనా పూరిత స్వరం ఆమెలో కలకలం రేపింది.

"బావా ఇదంతా నిజమేనా?"

"నిజం శారదా...ఎలా నిన్ను నమ్మించేది? ఇదిగో చూడు ఈ చీర నీ కోసమే తెచ్చాను" అంతవరకూ చేతిలో ఉన్న కవరు చిన్న కుంకుమ భరిణ ఆమె చేతిలో పెట్టాడు. సంజకెంజాయల్లో వింతగా మెరిసే ఆమె రూపాన్ని ఆనందంగా ఆత్రంగా చూస్తున్నాడు.

గులాబిరంగులో ఉన్న ఫుల్ వాయిల్ చీరా... ఎర్రని కుంకుమ, పచ్చని చేమంతులు...ఆమె హృదయం అంతులేని ఆనందంతో ఎగిసి పోయింది. ఆ రంగులు ఆమె గుండెల్లో నిండుకున్నాయి.

"బావా ఇదంతా నామీద ప్రేమతోనా...లేక" సందేహంగా ఆగిపోయింది.

"ఆగిపోయావేం శారదా...చెప్పనీ సందేహం... మనస్సాక్షిగా చెప్తున్నాను. నీ నిండు జీవితంలో వెన్నె

లలు కురిపిస్తాను. నీ కన్నుల్లో దీపావళి జరిపిస్తాను. నన్ను హృదయ పూర్వకంగా విశ్వసించు"...ఈ పెద్ద వాళ్ళ ఆంక్షలు లెక్క పెట్టినా పావన మధుకలశాన్ని దూరం చేసుకో లేను. చెప్పు శారదా నీ నోటితో చెప్పు నేనంటే నీ కిష్టమేనా లేక నల్లని వాణ్ణని"?—

"బావా! కంగారుగా అతన్ని వారించింది నేను నిన్ను నమ్మాలంటే ఇదొక్కటే నిదర్శనం"...కుంకుమ భరిణ తెరిచి అతని ముందుంచింది. రెండు వేళ్ళతో కుంకుమ తీసుకుని ఆమె నుదిటిమీద గుండ్రంగా దిద్దాడు. పశ్చిమాద్రిన అస్తమించబోతున్న సూర్య బింబంలా వెలిగి పోయిందా సింధూరం పచ్చని చేమంతులు ఆమె జడలో చేరి హాయిగా నవ్వేశాయి.



"శారదా ఇప్పుడైనా నమ్ముతావా?" ఆమె భుజాలు మృదువుగా పట్టుకుని తనవైపు తిప్పుకుంటూ మెల్లిగా అడిగాడు. ఆ స్పర్శ ఆమెకి మంచి గంధపు పూతలా ఉంది.

నీళ్ళు నిండిన ఆమె కళ్ళు అతనికెన్నో అర్థాలు చెప్పాయి. "శారదా, ఈ దిగులు కన్నీళ్ళు మానెయ్. సంతోషంగా హాయిగా ఉండు. సుమతి కీసునందకీ పెళ్ళిళ్ళు చేసెయ్యగానే నిన్ను నాదాన్ని చేసుకుంటాను..."ఆవేశంగా అన్నాడు.

"ఇదంతా...నిజమా...కలా...కాని... బావా ... ఆయన్ని మర్చిపోయి ఆస్మృతుల వలయం నుండి బయట పడి నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించగల నంటావా" జాలగా అతనివైపు చూసింది.

"తప్పకుండా శారదా...మరవు మానవ సమాజం లేకపోతే ఈ మనుగడ ఇలా అవిచ్ఛిన్నంగా సాగిపోదు. అతని తలపులు నిను కలవర పెట్టినా. నేను అసూయతో కుళ్ళి పోను. స్త్రీని సంకుచితంగా కట్టెయ్యాలనే దృక్పథం కాదు నాది...నీ జీవితంలో వసంతం వెల్లివిరియాలి. నా హృదయ రాణిగా నీవు కలకాలం నా గుండెల్లో నిండిపోవాలి—నీ గుం డెల్లో వలపు దీపాన్ని వెలిగించి నే పొంగిపోవాలి—"

"రావచ్చా" మంజుల గొంతు విని ఇద్దరూ ఉలిక్కి పడి చూశారు. శారద గబగబా బొట్టు తుడిపేసుకుని పూలు తీయబోయింది. మంజుల చటుక్కున ముందుకు వచ్చి ఆమె చేయి పట్టుకు వారించింది. "తీసెయ్యకు అక్కా!" బాధగా చూసింది. వద్దు మంజూ! ఎవరైనా చూస్తే"—ఆమె హృద యం వేగం కొట్టు కుంటున్నది.

"ఏమీ అనుకోరు—బావా నాన్నగారు నిన్ను పిలు స్తున్నారు రా...ఏమో అనుకున్నా గానీ, మా బావగారిలో హీరో లక్షణాలు కనిపిస్తున్నాయి" కొంటెగా నవ్వింది బావ ఆమె కళ్ళకి ఎంతో ఉన్నతుడుగా కనిపించాడు. "మావయ్య ముందుకెళ్ళే సరికి జీరోనయిపోయి జావగారి పోతానేమో మంజూ!" జాలిగా చూశాడు.

"బి బోల్డ్! మై బోయ్! గో ఎహెడ్ వీరేశలింగం గారి వారసుణ్ణని నిరూపించుకో" మంజులకి కాస్త అవకాశ మిచ్చినా వదిలి పెట్టదు.

"సరే...శారదా నే వెళతాను మామయ్య పిలుస్తు

న్నాట్ట." అదిరే గుండెలతో సరేనని తలూపింది. అతను వెళ్ళిపోయాక శూన్యంలోకిచూస్తూ ఆలోచిస్తున్నది. హఠాత్తుగా ఆమె దృష్టికి పక్కింటి సూరమ్మగారు కనిపించింది "ఆమె చూస్తే ఇంకేమన్నా ఉందా?" తల్లో పూలు తీసి చీరపాకెట్లో కుక్కి గబ గబా కిందకి దిగి వచ్చేసింది అదురుతున్న హృదయంతో.



# 7

కృష్ణ మోహన్ ఉన్న రెండు రోజులు శారదకిచాల హాయిగా గడిచిపోయింది. అతను చెప్పే ప్రియవచనాలు వింటుంటే ఆమె హృదయ కుసుమం క్రమ క్రమంగా వికసించి మధువు చిలుకుతుంది. ఇంట్లో ఎవ్వరూ లేనప్పుడు అతనిచ్చిన చీర కట్టుకుని, పూలు పెట్టుకుని మనసారా అద్దంలో చూసుకుంది. మనసు జలపాతంలా దుముకుతుంది. అక్క సంతోషానికి కారణం గ్రహించిన జ్యోతి లోలోపల

సంతోషించినా ఇది ఏ పరిణామాలకు దారి తీస్తుందోనని భయపడుతూనే ఉంది.

సాధ్యమైనంతవరకూ, అక్కకీ బావకీ ఏకాంతం కల్పించి తాను కళాధర్ ఊహల్లోకి జారిపోతుంది. అదొక చిత్రమైన మానసిక పరిణామం.

తను వెళ్ళబోయే ముందు జానకిరామయ్యతో ఏకాంతంగా మాట్లాడాడు కృష్ణమోహన్. రెండురోజులు శారదతో సన్నిహితంగా మెలిగి, ఆమె మనసు తెలుసుకున్నాక అతనికి వెయ్యేనుగుల బలం వచ్చినట్లయింది. అంతకు ముందు ఆయన ఎదురుగా ధైర్యంగా నిలవలేనివాడు ఎంతో హుందాగా ప్రవర్తించాడిప్పుడు. ప్రేమ అనేది టానిక్‌లా పనిచేస్తుంది కాబోలు యువహృదయాలలో.

"మావయ్యా! శారదకి మళ్ళీ పెళ్ళి చేయకూడదూ?" బీరువాలో ఏదో పుస్తకం వెతుకుతున్నట్లు నటిస్తూ అడిగాడు. వెళ్ళబోయేముందు జరుగబోయే దానికి నాందిగా.

"ఆ మాత్రం ఆలోచన నేనూ చేయకపోలేదురా... సమయం కలసి రావద్దూ? అయినా నువ్వేదో ఆశలు కల్పిస్తున్నావు దానికి. ఎందుకిలా చేస్తున్నావ్?"

"మావయ్యా! శారద ఆశలు నిజం చేస్తాను."

"అని నువ్వనుకుంటే చాలా? నీ వెనక పెద్దవాళ్ళ నిర్ణయం తెలుసుకో..."

"నా జీవితాన్నెలా తీర్చిదిద్దుకోవాలో నాకు బాగా తెలుసు."

"అది శారదని పెళ్ళిచేసుకోవటంతో సరిపోతుందను కుంటున్నావా? దాని తరువాత తలెత్తే సమస్యల సంగతి ఆలోచించావా?"

"సమస్యలు... ఈ సమస్యలకి భయపడే మనం ఎన్నో చేయాల్సిన పనులు చేయలేక పోతున్నాం" అతని స్వరంలో ఆవేశం, ముఖంలో ఏదో చేయాలన్న స్థిరనిర్ణయం.

"ఆవేశంలో కొట్టుకుపోతూ, నువ్వు వాస్తవాన్ని మర్చిపోతున్నావ్ కృష్ణా! మీ అమ్మ అసలే చాదస్తం మనిషి. శారదని నిండు మనసుతో ఆదరిస్తుందా? నీ కొచ్చే కట్నాలతో నీ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేయాలనే ప్లాన్‌లో ఉన్నాడు మీ నాన్న. దీనికి ఒప్పుకుంటాడా? నేనేం కట్నం యివ్వలేనుగదా! నువ్వు గట్టి పట్టు పడితే... ఒప్పుకున్నా నింద నా మీద వేస్తారు. బంధువుల ముందు నన్ను దోషిగా నిలబెట్టకు కృష్ణా! దాని ఖర్మ ఎలా ఉంటే అలా జరుగు తుంది. మా మానాన మమ్మల్ని బ్రతకనివ్వు" ఆయన గొంతులోని దీనత్వం అతని మనసును కదిలించివేసింది.

"మావయ్యా! ఇవన్నీ నేను ఆలోచించలేదు. ఐనా ఏ పరిస్థితుల్లోనూ నేను శారదని వదులుకోలేను." అతని గొంతులో నిండుగా అనురాగం తొణికిసలాడుతోంది. కళ్ళు చిత్రంగా మెరిసిపోతున్నాయి. ఆ క్షణంలో ఎవర్నయినా ఎదిరించగలను అన్న నిర్ణయంతో ఉన్నాడు.

"మావయ్యా! నువ్వు ఏమన్నా చెయ్... శారదని మాత్రం నాకు దూరం చేయకు. ఎండిన మోడులా, వసంతా

నికి నోచుకోని బ్రతుకు ఆమె బ్రతుకుతుంటే నేను మన శ్శాంతిగా ఉండలేను" మేనమామను రెండుచేతులు ఆర్తిగా పట్టుకుని ఆవేదనగా ఆ కళ్ళల్లోకి చూశాడు. ఆయన కళ్ళ ల్లోని ప్రశాంతత అతని మనసుని సంతోష పెట్టింది.

ఇంట్లో అందరికీ పేరు పేరునా చెప్పి బయలుదేరాడు కృష్ణమోహన్. నడుస్తూ నడుస్తూ హఠాత్తుగా ఆగి వెనక్కి తిరిగి చూశాడు. కిటికీ ఊచల్లోనుంచి రెండు కళ్లు దీనంగా చూస్తున్నాయి. ఆ కళ్ళల్లోనుంచి రెండు మంచి ముత్యాలు రాలటానికి సిద్ధంగా ఉన్నాయి.

"నిన్ను నా దాన్ని చేసుకునే శుభక్షణం కోసమే చూస్తుంటాను శారదా! ప్రస్తుతానికింకేమీ చేయలేని నిస్స హాయుణ్ని నన్ను క్షమించు" బలవంతాన చూపులు తిప్పు కుని గబ గబా అడుగులేసుకుంటూ నడిచి పోయాడు. ఆ అడుగులు తన గుండెమీదే పడుతున్నట్లనిపించింది.

అతను వెళ్ళిపోగానే శారదకి మనసంతా శూన్యంగా అనిపించింది. ఎవరూ లేకుండా చూసి తన పెట్టెలో రహ స్యంగా దాచుకున్న గులాబీరంగు చీరని ఆప్యాయంగాతడిమి చూసుకుంది. అతనిచ్చిన చేమంతిపూలు, ముద్దులొలికే గోపురం డిజైన్‌లోఉన్న కుంకుమ భరిణ ఆమె కెంతో అపు రూపంగా అనిపించాయి. అతని స్మృతిని పదిలంగా గుండెల్లో దాచుకుని మురిసి పోయింది.

# 8

దొర్లిపోతున్న రోజులు వసంతకాలాన్ని చూసి ఆగి పోయాయా అన్నట్లు మల్లెలు ఫక్కున నవ్వుతున్నాయి. కోయిల కుహూ కుహూ నాదాలతో కన్నెపిల్లలమనసులు మధురమైన కోర్కెలు రేకెత్తిస్తున్నది.

కాలేజీనుంచి కొంచెం ఆలస్యంగా ఇంటికి చేరుకు న్నారు జానకిరామయ్యగారు. మంచినీళ్ళందిస్తున్న లలి తమ్మలో కొత్తఉత్సాహం కనిపిస్తున్నది.

"ఇందాకటున్నుంచీ చూస్తున్నా మీ కోసం. ఇవాళ ఇంతాలస్య మయిందేం?"

"ఏదో మీటింగుందిలే ఏవిటి? ఏదైనా విశేషమా? ఏదైనా పనుందా?"

"ఇప్పుడు చిన్న పనే—ఇహ నుండీ చేతినిండా పని మీకూ నాకు. మంజుల పెద్దదైంది" చిన్నగా నవ్వింది ఆమె.

గుండెలమీద కుంపటిలా సంవత్సరానికో ఆడపిల్ల పెద్దదై కూర్చుంటున్నది.

"శంకరుణ్ణి పంపించి తాటి ఆకులు తెప్పించాను. మీరొస్తే కొబ్బరి, బెల్లం తెప్పించి నలుగురు ముత్తయిదువుల్ని పిలుద్దా మనుకుంటున్నా" ఇటువంటి వేడుకలంటే ఆమెకి మహా సరదా.

కావలసినవన్నీ తెప్పించి ఇద్దరు కూతుళ్ళకి ఉత్తరాలు రాశారు. ఆయనకి మనసంతా గుబులుగా ఉంది. సరస్వతికి ఒక్క సంబంధమూ కుదరటంలేదు. ఆమెకి చదువు మీద శ్రద్ధ తక్కువ. ఈ పరిస్థితుల్లో ఇంకోపిల్ల పెద్దదైతే ఇద్దరికీ వరాన్వేషణ ప్రారంభించాలి. ఇప్పుడు మొదలుపెడితే ఎప్పటికి ముగిసేను?...

కృష్ణమోహన్ సృష్టించి వెళ్ళిన వలపు కల్లోలం శారదలో ఎలా సంచలనం కలిగిస్తున్నదీ...ఆయన గమనించక పోలేదు.

మంజులకీ సరస్వతికీ సంబంధాలు కుదిరి పెళ్ళయిపోతే శారద విషయంలో ధైర్యం చేయవచ్చని ఆయన ఆలోచన. ముందే శారదకి చేస్తే తరువాత విరుచుకుపడే పరిణామాలు ఎదుర్కోవటం కష్టం...వాళ్ళిద్దర్నీ గడప దాటించేస్తే తరవాత ఏ ఉప్పెన విరుచుకు పడినా ధైర్యంగా నిలవాలనే ఆయన నిర్ణయించుకున్నారు.

లలితమ్మని పిలిచి చెప్పారు. "నువ్వు హడావిడిచేసి ఆర్భాటం చేయకు. సింపుల్‌గా ముగించు."

"నాకు మాత్రం తెలియదా ఏవిటి? ఏదో శాస్త్రార్థం చెయ్యాలని గానీ... ఆడంబరంగా చేసి మనం ఎక్కడ భరించ గలం. ఆ రోజుకి ఊళ్ళో ఉన్న నలుగుర్నీ భోజనాలకి పిలుస్తాను. పిల్ల పెద్దదైతే కనీసం భోజనాలైనా పెట్టలేదని తరవాత చెవులు కొరుక్కుంటారు..."

"సరే... ఎలాగో నీ ఇష్టం వచ్చినట్టు కానియ్. కాస్త వెనకా ముందు చూసి ఖర్చుపెట్టు. అసలే బోళా మనిషివి నువ్వు!" బంధువులంటే ఆయనకే మాత్రం సదభిప్రాయం లేదు. అందరూ తినిపోటానికి వచ్చేవాళ్ళేగానీ... సమయానికి ఆదుకునేవాళ్ళు ఒక్కరూ కనిపించరు. నోటితో నవ్వుతూ నొసలుతో వెక్కిరించే బంధువులకి సాధ్యమైనంత దూరంగా ఉండాలని ప్రయత్నిస్తుంటారు.

తొమ్మిదోరోజుకల్లా కనకదుర్గ, బాలత్రిపురసుందరి వచ్చేశారు. వాళ్ళపిల్లలు చేసే గోలతో ఇల్లంతా హోరెత్తి పోతోంది.

పదకొండోరోజు అట్ల బంతి చేసి, అందర్నీ పేరంటానికి పిలిచేరు.

రకరకాల అలంకరణతో మెరిసిపోతున్న పేరంటాళ్ళని చూడగానే శారద హృదయంలో కలకలం మొదలైంది. చెల్లెలి మొహంలోని అలజడి అర్థంచేసుకుంది త్రిపురసుందరి. ఈ అర్థంలేని ఆచారాలంటే ఆమెకి ఒళ్ళుమంట. అనాలనుకున్న మాట కుండ బద్దలు కొట్టినట్టు అనటం, చెయ్యాలనుకున్న పని ఠకామని చెయ్యటం ఆమెకలవాటు.

శారద చేయిపట్టి గదిలోకి తీసికెళ్ళింది. బారెడు జుట్టుని చక్కగా దువ్వి జడవేసింది. జడ నిండుగా మల్లెలు తురిమి నుదుట సన్నగా బొట్టు పెట్టింది. అక్క చేస్తున్న పనిని గుడ్లప్పగించి చూస్తోంది శారద. మంజులకి చాలా సంతోషం కలిగింది...తను చెయ్యాలనుకుని చెయ్యలేనిపని అక్క ధైర్యంగా చేస్తున్నందుకు మనసులోనే అభినందించింది.

తన పట్టుచీర ఒకటి తీసి శారదకిచ్చి కట్టుకోమంది. తెల్లబోయిన శారద కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "వద్దులే అక్కా నలుగురూ చూస్తే బావుండదు."

"నాన్‌సెన్స్! ఇలాటి చాదస్తపు ఆలోచనలు మానెయ్యి. బొట్టు పూలు ఆడపిల్లకి జన్మహక్కు. ఆమె నుంచి వాటిని దూరంచేసే అధికారం ఎవరికీ లేదు. ఆఖరికి మనసు రాయూనిక్కూడా... ఊఁ కమాన్ కానియ్యి"

మంజుల కూడా బతిమాలింది. "అక్కా! మనం ధైర్యం చెయ్యకపోతే...ఈ సంఘం మనల్ని తరిమికొడుతుందే. మొదట్లో కొత్తగా వింతగా...చూసి చెవులు కొరుక్కుంటారు. ఆ తర్వాత మామూలై పోతుంది."

ఇంతలో అక్కడికి త్రిపుర సుందరి భర్త మధుసూదనం వచ్చాడు.

"అబ్బా! శారదేనా...నా కళ్ళని నేనే నమ్మలేక పోతున్నాననుకో! రతీదేవిలా ఉన్నావు" అంటూ ప్రశంసా

పూర్వకంగా చూశాడు. ఆమె అద్భుత సౌందర్యాన్ని చూస్తుంటే అతనికళ్ళు జిగేలు మంటున్నాయి.

"నేనెప్పుడో చెప్పాను మంజూ మీఅక్కకి.శారదకి మళ్ళీ పెళ్ళి చెయ్యండి బావుంటుంది అని—ఎవరిదాకానో ఎందుకు—మీ అక్క ఒప్పుకుంటే నేనీ క్షణంలో రెడీ" భార్యవంక కొంటెగా చూశాడు.

అతని మాటలకి మరదళ్ళంతా నవ్వేశారు. "చాల్లెండి మీరు—మీను—అసలే సిగ్గుతో చితికి పోతుంటేను" త్రిపుర సుందరి భర్తను మందలించింది.

మధుసూదనం సహజంగా మాటకారి. మరదళ్ళని తమాషా మాటలతో ఆట పట్టించటం అతనికి సరదా! శారదంటే అతని మనసునిండా సానుభూతి.

భార్య మాటల్ని లెక్కపెట్టకుండా శారద దగ్గరగా వచ్చి అన్నాడు. "నిజం శారదా—నువ్వు పిచ్చిపిచ్చి సెంటిమెంట్లన్నీ వదిలేసి—జీవితాన్ని నందన వనం చేసుకో—నీకు వయసేం ముదిరిపోయిందని—బోలెడు భవిష్యత్తు నీ ముందు నిలిచి వుంది" అతను సిన్సియర్‌గా చెపుతున్న మాటలకి శారద హృదయం స్పందించింది. వీళ్ళంతా నా శ్రేయోభిలాషులే—అన్న భావం మెదిలి మనసు పాలకడలిలా పొంగింది.

"బావగారూ...మీ రింక బయటికెళతారా? ఇదీ మా ఏకైక మేకప్ రూమ్. మీ రిలాగే ఇంకాసేపు

ఇక్కడే ఉంటే—మేం సగం మేకప్ చేసుకున్న సినీ తారల్లా పేరంటంలో కూర్చోవాల్సిందే ... "మంజుల మాటలకి అంధరు పక పకా నవ్వేశారు.

"ఏవిటో మరిదిగారు...మరదళ్ళముందు ప్రతాపం చూపించేస్తున్నారు" అంటూ వచ్చింది కనకదుర్గ. సహజంగా శాంతస్వభావం ఆమెది. పరిహాసాలు, ఛలోక్తులు అంతగా పట్టించుకోదు ఎప్పుడో తప్ప!

"చూడండి వదినగారు...ఏదో శారదకి హితోపదేశం చేద్దామని!" ఇహ లాభంలేదనుకుని భర్తని తోసుకుంటూ గది బయటికి తీసికెళ్ళింది త్రిపురసుందరి.

పేరంటం హడావిడిలో మునిగిఉన్న లలితమ్మ యీ గొడవంతా పట్టించుకోనేలేదు.

చక్కగా అలంకరించిన మంజులని కుర్చీలో కూర్చోబెట్టారు. మంజుల మొహంలో కొత్తకళ వచ్చింది. పేరంటాళ్ళందరు పరిహాసోక్తులతో ఛలోక్తులతో వాతావరణాన్ని చైతన్యవంతం చేస్తున్నారు.

రోటికి పసుపు తాడు కట్టి రోట్లో ఎండుకొబ్బరి బెల్లం వేసి దంచుతూ ముత్తయిదువలు "సువ్వీ! సువ్వీ!" అంటూ పాటలు పాడారు.

ఏమే చెల్లెలా! ఏవమ్మా కోడలా! ఏం సూరమ్మపిన్నీ! ఏం సుబ్బమ్మత్తా! ఏం కామమ్మ! కూతురా! రత్తమ్మ పెద్దమ్మా అంటూ పలకరించుకుంటున్న పేరంటాళ్ల నోళ్ళు

హఠాత్తుగా ఆగిపోయాయి. వారి చూపులు ఏదో అపూర్వ దృశ్యాన్ని చూస్తున్నట్లు స్థిరంగా నిలిచి పోయాయి.

శారద కుందనపు బొమ్మలానడిచివచ్చి వారిమధ్యలో కూర్చుంది. కొందరికళ్ళు తృప్తిగా, మరి కొందరికళ్ళు అసూయగా, కుళ్ళుగా మంటలు కక్కుతూ... శారదకి లోలోపల భయంగాఉంది. మంజుల చూపులు భయంలేదులే అక్కా! అన్నట్లు చూస్తున్నాయి. త్రిపురసుందరి శారద పక్కనే కూర్చుంది చిన్నగా నవ్వుతూ. అందరినీ సాదరంగా పలకరిస్తూను.

కొంతమంది ఎవరికీ వినిపించకుండా చెవులు కొరుక్కుంటున్నారు. లలితమ్మ మతిపోయిన దానిలా ఛూడసాగింది. ఆమె మనసులో పిడుగులు పడుతున్నాయి. అందరు తనని ఎలా అవమానిస్తారోనని భయంతో వణికిపోసాగింది. పక్కింటి సూరమ్మ నోరు మాత్రం ఫూరుకోలేదు.

"అదేవిటి లలితమ్మా! శుభమా అని సమర్త పెళ్ళి కూతుర్ని చేసి వెధవ ముండని తీసుకొచ్చిఎదురుగా కూర్చోబెట్టారు?" దీర్ఘం తీసింది శారద వంక విచిత్రంగా చూస్తూ.

"సూరమ్మత్తా! కాసేపు నువ్వు నోరుమూసుకో! ఇంత మంది ఫూరుకోగాలేంది నీకేమయింది?" నిప్పులు కక్కుతూ చూసింది త్రిపురసుందరి.

"అదికాదే అమ్మాయ్! బొత్తిగా ఆచారం మంట గలిసి పోతే ఎట్లానే...ఎవరో ఏదో చేశారని మనం కూడా అనాచారాన్ని నెత్తిన మోసుకుంటామా?"

ఆవిడ తన పిడివాదాన్ని వదిలిపెట్టలేదు.

"సూరమ్మత్తా! నేనొకటడుగుతాను చెపుతావూ?" మంజుల కంఠం పిడుగులా వినిపించింది.

"ఏవిటే—" వెటకారంగా అడిగింది.

"కోరికల్ని చంపుకోలేక—చాటు మాటుగా సరసాలు వెలగపెడుతూ అసహ్యంగా ప్రవర్తించే వితంతువులకన్నా—మా అక్క ఏం చెడిపోయింది" తీవ్రంగా అడిగింది.

"నువ్వూరుకో మంజూ! అంత పెద్ద ప్రశ్నలడిగితే సమాధానం ఎట్లా చెపుతుంది అత్తయ్య. పోన్లే అత్తయ్యా! మేం కానిపనులు చేయటంలేదు. ఎవరి కొంపకీ నిప్పంటించటం లేదు. ఎవరి పరువు తీయటంలేదు. ఇది మా యిష్టం నీకెందుకు?"

"అయ్యో! అయ్యో! పెద్ద ముండని పట్టుకుని ఎన్ని మాటలడుగుతున్నారే" సూరమ్మ రాగం తీసింది.

పరిస్థితి శ్రుతిమించి రాగాన పడుతున్నదని గ్రహించింది సరస్వతి. లేచి వెళ్ళి అందరి కాళ్లకీ పసుపురాసి, గంధం వ్రాసి బొట్లు పెట్టింది. కనకదుర్గ పండు తాంబూలం చిమ్మిడిముద్దా తెచ్చి అందరికీ ఇచ్చింది.

కొందరు సూరమ్మ వైపు—మరి కొందరు త్రిపుర సుందరి వైపు మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు. చాలామంది మనసులకి శారద వితంతువు అనుకోవటమే బాధగా అనిపించింది.

అందరు వెళ్ళిపోగానే శారద దగ్గరకొచ్చింది లలితమ్మ. మొహాన బొట్టు తుడిపేసి, జడలో పూలు లాగి నేల కేసి కొట్టింది. ఆ చెంపా ఈ చెంపా వాయించటం మొదలు పెట్టింది.

"పాపిష్టిదానా! — నువ్వు పుట్టినప్పుడే పోయినా బావుండేదికదే...అందరిలో తలవంపులు తెస్తావా? ఆ సూరమ్మ నోరసలే మంచిదికాదు. ఇక వూరు వాడా ఏకం చేస్తుంది. ఈ సంగతి వింటే ఆయన తలెత్తుకొని బజారులో తిరగ్గలడా?" అపరకాళిలా విజృంభించిన లలితమ్మని మంజుల త్రిపురసుందరి బలవంతాన ఇవతలికి లాగారు. శారద దుఃఖం ఆపుకోలేక గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది.

"నీకేమన్నా పిచ్చి పట్టిందా ఏమే? ఎందుకుదాన్నట్లా చంపుకుతిన్నావ్?" మంజుల కోపం పట్టలేక తల్లికి ఎదురు తిరిగింది. మరుక్షణం మంజుల చెంపలు ఛెళ్ళు మన్నాయి.

అంతవరకూ డాబామీద కూర్చున్న మధుసూదనం కిందకి దిగొచ్చాడు ఈగోలవిని. "మీరు చేసిందేవిటే? అది వద్దో మొర్రో అంటున్నా వినకుండా సింగారిస్తిరి. ఈ చావు దెబ్బలు తింటానికేనా? మీ సంస్కారాలు, ప్రయోగాలు దానిమీద చెయ్యకండి. ఇవన్నీ వినటానికీ రాయడానికీ బాగానేఉంటాయి ఛీ!సుందకీ—నీకసలు బుద్ధిలేదే...పోయి చూడండి తలుపేసుకుని అదేం చేస్తున్నదో" కనకదుర్గ చెల్లెల్ని దగ్గర తిట్టేసింది బాధలో! శారద ఏం అఘాయిత్యం చేస్తుందోనని భయమేసింది. చటుక్కున కర్తవ్యం స్ఫురించిన

వాడిలా మధుసూదనం గదిముందుకు పరిగెత్తాడు. "శారదా తలుపు తియ్యమ్మా" అని పిలిచాడు సమాధానం రాలేదు. గదిలో స్టూలు లాగిన చప్పుడు వినిపించింది.

సరస్వతి దొడ్డివాకిలి గుండా వెళ్ళి కిటికీలోనుంచి చూసింది. దూలానికి చీర వేసి ఉచ్చు తయారు చేస్తున్నది శారద. ఆమె ముఖంలో భయంకరమైన నిర్ణయం తాలూకు దృఢ చిహ్నం! ఆమెకి గుండె గుభేలుమంది.

"అమ్మ బాబోయ్! అక్కయ్య ఉరిపోసుకుంటున్నదే... బావా—తలుపులు పగలగొట్టు. అయ్యో! ఇవ్వాళ లేచి ఎవరి మొహం చూశావే"సరస్వతి ఆపుకోలేని ఉద్వేగంతో ఏడుస్తోంది,

అందరికీ గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. మంజుల తలుపులు బలంగా బాదుతూ "అక్కయ్యా అంతపని చెయ్యకు—రా తలుపులు తియ్యి" అని హృదయ విదారకంగా ఏడుస్తోంది; అందరూ కలిసి బలంగా తలుపులు బాదుతూనే ఉన్నారు.

బజారుకెళ్ళిన కాళిదాసు రానే వచ్చాడు. ఇంట్లో గంద్రగోళం చూసి అతనికి కంగారు పుట్టింది, కాళ్ళూ చేతులు ఆడలేదు. చిన్నది వసుధ ఏడుస్తూ . సంగతంతా అన్నకి చెప్పింది. కాళిదాసుకి ఆవేశం వస్తే ఆగదు. అపర వీరభద్రుడిలా విజృంభించాడు. కత్తి తీసుకుని కిటికీ దగ్గరికి పరిగెత్తాడు. ముడి కంఠానికి బిగించుకో బోతున్న శారద

తమ్ముడిగొంతు విని త్రుళ్ళిపడి చూసింది. వంశానికి ఒక్కగా నొక్కడని తమ్ముడంటే ఆమెకి చాలా ప్రేమ.

"అక్కయ్యా! నువ్వు తలుపుతీసి బయటికి రాకపోతే ఈ కత్తి—పళ్ళుకోసుకున్నదైనా—పదునుగానే ఉంది.— నా గుండెల్లోకి దిగుతుంది. ఇక ఈ వంశానికి మోక్షం లేదు తరవాత నీ ఇష్టం—" ఆ గొంతులో స్థిరనిర్ణయం శారదని ముందుకు సాగనివ్వలేదు.

మరుక్షణం తలుపులు తెరుచుకుని బయటికొచ్చింది శారద.

"అయ్యో! నా తల్లీ—ఎంత పనిచేశావే—పాపిష్టి దాన్ని నా చేతులు విరిగిపోను—ఎన్ని దెబ్బలు కొట్టానే" శోకాలు తీసింది లలితమ్మ.

"ఇంక ఊరుకోండి అత్తయ్యగారూ—వయసొచ్చిన పిల్లల్ని అంతలేసి మాటలంటే వాళ్ళ మనసు గాయ పడదూ?"

"నిజమే నాయనే—నా బంగారు తండ్రి సమయానికి దేవుడల్లే వచ్చి అక్కని రక్షించుకున్నాడు—"

"ఇక చాల్లే నోర్మూసుకో—ఏ దొచ్చినా పట్టలేం నీతో" కాళిదాసు తల్లిని కసురుకుని శారదవైపు తిరిగాడు. కత్తి ఇంకా అతని చేతిలోనే ఉంది.

"ఆ కత్తి ఇంక అవతల పారెయ్యరా—" భయంగా

చూసింది శారద. జ్యోతి తడుముకుంటూ వచ్చి శారదని కౌగిలించుకుంది. "నన్నేంచేసి పోదామనుకున్నావే— నా కళ్లు లేకపోయినా—నీ కళ్ళతో ఈ లోకాన్ని చూసుకుని బతుకుతున్నానే"—జ్యోతికి దుఃఖం ఆగటం లేదు.

"అందుకే—మీ ఇద్దరూ—ఇలాంటి పిచ్చి వేషాలు ఇంకోసారి వెయ్యనని ఒట్టెయ్యండి—" కాళిదాసు గొంతు కఠినంగా ఉంది. ఆ కఠినత్వంలో అంతులేని సోదరప్రేమ.

"నేనేం చేశానురా—" బిక్కమొగంవేసుకుని అడిగింది జ్యోతి.

"అప్పుడప్పుడూ నువ్వే అంటావుగా" ఈ కళ్ళ బదులు నా ప్రాణాలు పోయినా బావుండేదని ఆపాట ఇంకోసారి పాడే వంటే ఊరుకోను—" అలాగేలే అంటూ బుద్ధిగా తలూపింది.

"శభాష్! బామ్మర్దీ—మొత్తానికి హీరో ననిపించుకున్నావ్!" మధుసూదనం కాళిదాసు భుజాల చుట్టూ ఆప్యాయంగా చేతులు వేశాడు.

ఆగాలివాన అంతటితో ఆగినా, జానకిరామయ్య హృదయంలో దాని తాలూకు భీభత్సం మిగిలిపోయే ఉంది.

# 9

ఎవరితోనూ నిమిత్తం లేనట్లు కాల పురుషుడు కాల చక్రాన్ని గిరగిరా తిప్పేస్తూనే ఉన్నాడు. ఋతువులూ వత్స రాలు మారినట్లే మనుషుల మనసుల్లో మార్పులు వస్తూనే ఉన్నాయి.

శారదభాషా ప్రవీణ పాసై ట్రయినింగు పూర్తిచేసి ఆ వూళ్ళోనే ఒక మునిసిపల్ హైస్కూల్లో టీచరుగాపని చేస్తుంది. కాళిదాసు బి. ఏ. పూర్తిచేసి హైదరాబాదులో ఏదో ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. సరసర్వతిచదువు హైస్కూలుతోనేఆగిపోయింది.ఇంటివద్దనే ఉండి సంస్కృతం చదువుతున్నది.

మంజుల బి. ఏ లో చేరింది. డాక్టరుకావాలని కలలు కని పి. యు. సి. సైన్సు గ్రూపు తీసుకున్నా, ఆ ఆశలు ఫలించవని కుటుంబ పరిస్థితులు గమనించి అర్థం చేసుకున్నది. జ్యోతి కళాధర్ తన జీవితాన్ని వెలిగిస్తాడని కలలు కంటు

న్నది. శారద కృష్ణమోహన్ రాకకోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నది.

జానకిరామయ్య కుమార్తెల కలలు పండించాలని నిరంతరం శ్రమిస్తూనే ఉన్నాడు.

సరస్వతిని చూడటానికి వచ్చిన ప్రతివాళ్లు మంజుల నయితే చేసుకుంటామని ఉత్తరాలు రాసేవారు. ఇద్దరు ముగ్గురయితే పదివేలిస్తామని ముందు మాటిస్తేగానీ పెళ్ళి చూపులకిగూడా రామని ఖచ్చితంగా చెప్పేశారు. సరస్వతిని ఎలా గట్టెక్కించాలా అని ఆయన ఆలోచనలతో సతమత మవుతుంటే కృష్ణమోహన్ తల్లిరాసిన లెటర్ ఆయన్ని మరింత బాధించింది.

జానకిరామయ్య అన్నయ్యకు నమస్కరించి వ్రాయు నది, కృష్ణమోహన్ శారదని చేసుకుంటానని మొండికేస్తు న్నాడు. వాళ్లిద్దరు ఒక ఈడువాళ్లు బాగుండదని అప్పట్లో అనుకున్నాం గదా! ఇప్పుడవేవీ లెక్కచేసేస్థితిలో లేడు వీడు. "పిచ్చి కుదిరింది రోకలి తలకి చుట్టండి" అన్నట్లుంది వీడి స్థితి.

అన్నయ్యా! నువ్వయినా వాడికి నచ్చ చెప్పక పోయావా? తల చెడిన పిల్లని చేసుకుంటే రేపు మేం నలుగురిలో ఎలా తలెత్తుకు తిరగ్గలం? మా పిల్లలకి పెళ్ళిళ్ళు ఎలా అవుతాయి? నాకూ ఆడపిల్లలు ఉన్నారు కదా! ఆలో చించు. మీ బావగారు నా మీద మండి పడుతున్నారు. ఈ పెళ్ళి చేసుకుంటే నాకూ వాడికీ సంబంధం లేనట్లు అని

రంకేస్తున్నారు ఇంట్లో. వీళ్ళిద్దరి మధ్య నేను నలిగి ఛస్తు న్నాను. నెల్లూరు నుంచి వచ్చిన సంబంధం మంచిది ' వాళ్లు బాగా వున్న వాళ్ళు పదివేలు కట్నమిచ్చి లాంచనాలు జరుపుతారట నువ్వు వాడికి ఎలాగైనా నచ్చ చెప్పు నీ మేలు ఈ జన్మలో మర్చిపోను. నీ మీద కొండంత ఆశ పెట్టుకున్నాను. ఏం చేస్తావో నీ ఇష్టం.

చెల్లెలు

సుశీల



ఆ లెటర్ చదివి కర్తవ్యం తెలియనివానిలా అలాగే చూస్తుండిపోయారు.

అదే సమయంలో కృష్ణమోహన్ రాసిన లెటర్‌ని తన్మయత్వంతో చదువుకుంటుంది శారద.

ఒకే సమస్యకి రెండువైపులా పదును-ఒక వైపుచల్లని మల్లెలు-మరోవైపు సమస్యల బాణాలు అదే సృష్టిలోని విచిత్రం.

# 10

మంజులని కూర్చోబెట్టుకుని వ్యాకరణం చెబుతున్నారు జానకిరామయ్య. లోపల గదిలో కూర్చుని వీణ వాయించుకుంటోంది జ్యోతి. శారద కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుతూ ఆలోచనలోకి జారిపోయింది.

అంతక్రితంరోజే కళాధర్ వచ్చి ఓ వార్త చెప్పి వెళ్ళాడు జ్యోతికి. అప్పటినుంచీ ఆమె మనసు మల్లెపూల నావమీద తేలిపోతూ, పారిజాత సుమసౌరభాలతో ఊసులాడుతుంది. శారదతో చెప్పాలా? వద్దా? అని సంశయం? అసలిది జరుగుతుందా? తన జీవితంలో వెలుగు వెన్నెలకురుస్తుందా అని భయం? ఆత్రుత.

ఆ సాయంత్రం జ్యోతి డాబామీద కూర్చునిమల్లెలు మాల కడుతుంది. ఆమె మనసు అందాలు పొంగిపోయే సంధ్యాకాలాన్ని ఊహించుకుంటోంది. మల్లెపూలు ఎవరో అందిస్తున్నారు. చటుక్కున ఆగిపోయి ఆ చేయి పట్టుకుంది. బలమైన చేయి, ఆ స్పర్శకి వళ్ళు ఝల్లుమంది. "నువ్వా

కళా! ఎప్పుడొచ్చావు?" అంది ఆనందం కెరటంలా గొంతులో ఎగిసిపడుతుండగా.

"ఇప్పుడే జ్యోతీ! శిల్పసుందరిలా నీవు అందంగా, సున్నితంగా కదులుతున్న నీ వేళ్ళు... భావలోకాల్లో తేలి పోతున్న నీ కళ్ళు—"

"ఊః కవిత్వం వచ్చేస్తుంది అబ్బాయిగారికి? ఇంతకీ విశేషం ఏవిటో?"

"విశేషమే మరి—నోరు తెరు ఏదీ..." అలాఅంటూ తను తెచ్చిన లడ్డు తుంచి ఆమె నోటిలో పెట్టాడు.

"ఏవిటి ఇంతకీ గుడ్ న్యూస్?"

"ఊఁ చెప్పేస్తున్నాను—నాకు ఉద్యోగం వచ్చేసింది"

"ఎక్కడ?"

"హైదరాబాదులో—"

"నిజంగానా?" అతని చేతులు స్నేహపూరితంగా తాకింది. ఆ స్పర్శ ఎంతో ధైర్యంగా హాయిగా నిశ్చింతగా ఉంది—

"నిజం జ్యోతీ! ఇహ ఇలా కలలు కంటూ గడపా ల్సిన అవసరం లేదు—నా స్వప్న రాణిని రోజూ నా కౌగి లిలో...నా కన్నుల చెరలో..."

"హుష్ః...గట్టిగా అరవకండి—ఎవరయినా వస్తారు

పక్కింటి సూరమ్మత్త చూసిందంటే...అందరికీ ప్రచారం చేసేస్తుంది?" నెమ్మదిగా భయంగా అంది.

"ఇక ఎవరికీ భయపడాల్సిన అవసరం లేదు...నాన్న గారికి ఒప్పించేను, మన పెళ్ళికి మంచిరోజు చూసుకుని వస్తా మన్నారు మీ ఇంటికి మాట్లాట్టానికి."

"ఇదంతా నిజమేనా? కలా?" సందేహం ఆమె గొంతులో.

"ముమ్మాటికీ నిజం జ్యోతీ!...అయితే కొన్ని షరతులు పెట్టింది మా అమ్మ. వాటికి మీ వాళ్ళు ఒప్పుకోవాలి. ఒప్పుకోకపోయినా ఆగదనుకో—నీకు తెలుసుగా నా పట్టుదల సంగతి. జీవితాంతం ఇలా ఉండిపొమ్మన్నా ఉంటానుగానీ జ్యోతిలేని ఈ బ్రతుకు?"

"కళా! నీ కెందుకీ గుడ్డిదానిమీద ఇంత అనురాగం"

"ఎందుకంటే ఏం చెప్పేది? అదో అవ్యక్తమైనతీయని భావన—మరెవరి సన్నిధిలో స్పందించని ఈ హృదయం... నీ ముందు మధుర గీతాలు పాడుతుంది. అప్పుడే విచ్చిన పూవుల్లో నీ అందమైన నవ్వు లీలగా తోచి నన్ను పిచ్చి వాడ్ని చేస్తుంది. ఎందుకు? ఏమిటి? అనే ప్రశ్నలకి సమాధానం లేదు."

ఆమె కొంచెంసేపు మౌనంగా కూర్చుండిపోయింది. అతని మాటల్లోని మాధుర్యాన్ని మనసులోని మమతని మౌనంగా తన గుండెలలో నింపుకుంటున్న దానిలా ఉండిపోయాడు.

"నువ్వు నిజంగా నా కోసం ఇంత ఆరాటపడుతున్నా వనుకోలేదు. ఈ గుడ్డిదాన్ని చేసుకుని ఏం సుఖపడదామను కుంటున్నావ్?" బాధగా అంది.

ఆమె మొహాన్ని తన చేతులలోకి తీసుకుని అందమైన కనురెప్పలమీద మృదువుగా చుంబించాడు ఆమె ప్రశ్నకి సమాధానంగా. ఆమె తలని ఆప్యాయంగా నిమురుతూ "కష్ట మైనా, సుఖమైనా అది నాకు స్వర్గతుల్యం జ్యోతీ! నువ్వు నాకు కావాలి అంతకుమించి నేనేమీ ఆలోచించలేదు. ఇంకేం సుఖాలు అక్కర్లేదు."

"నీ వనుకున్నట్లు నాకు చూపు రాకపోతే ఏం చేస్తావ్?" హఠాత్ గా అడిగింది.

"ఏం చేయను! నా ప్రణయ దేవతని పదిలంగా నా గుండెలో దాచుకుంటాను. ఇంకా సుకుమారంగా అపురూ పంగా చూసుకుంటాను." ఆవేశంగా అన్నాడు.

దీర్ఘంగా నిట్టూర్చింది ఆమె.

"ఇంతకీ మీ అమ్మగారేమన్నారో చెప్పావు కాదూ?" కొంచెం సేపాగి అంది.

"నువ్వు అపార్థం చేసుకోనంటే చెబుతాను."

"ఫరవాలేదు చెప్పు?"

"కొన్నాళ్ళు శారదగారు మనతో ఉంటే బాగుం టుంది?"

"అదెలా కుదురుతుంది?" కంగారుగా అంది.

"తప్పదు జ్యోతీ! నేను ఆఫీస్ కెళ్ళిపోతేనిన్నుచూసు కోటానికెవరయినా కావాలికదా."

"నిజమే..." తల వంచుకుని ఆలోచనలో పడిపో యింది. ఇంతలో మంజుల గబగబా పైకి వచ్చింది. "కళా ధర్ గారూ! నాన్నగారొస్తున్నారు మీారొచ్చి కింద కూర్చోండి" ఆ మాట వింటూనే అతను కంగారుగా లేచి కిందకి దిగి వచ్చేశాడు.

కళాధర్ వినిపించిన చల్లని మాటని అతని ప్రవర్తనని తలుచుకుంటుంటే ఆమెకు హాయిగా ఉంది. వీణ పక్కన పెట్టేసి వచ్చి శారదపక్కన కూర్చుంది. "ఏం జ్యోతీ! అయి పోయిందా సాధన?"

"ఆఁ అయిపోయింది. గానీ... నే నొకటి అడుగుతాను ఏమనుకోకుండా చెప్తావా అక్కా?"

"ఏవిటే ఇవ్వాళ కొత్తగా అడుగుతున్నావ్?" పుస్తకం మూసేస్తూ అడిగింది.

"వ్వూహుఁ అదికాదులే...నువ్వు చెపుతానంటేనే అడుగుతాను...అది ఒక చిక్కు సమస్య అందుకే."

"ఏవిటో అడుగు...అసలు సంగతి తెలిస్తే గదా నాకు?"

"ఏం లేదు...నాకు...నాకు..."

"ఏవిటా నంగి మాటలు...సరిగ్గా అడుగు నా దగ్గర భయమేమిటే నీకు?"

"ఏం లేదక్కా! ఒకవేళ నాకు చూపు రాదనుకో అప్పుడు నువ్వు నాకు...జీవితాంతం..."

చెల్లెలి చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నిమిరింది శారద. "పిచ్చిదానా! ఒకవేళ అలా జరిగితే... అదే భగవన్నిర్ణయమైతే...నేను జీవితాంతం నీకు నీడగా తోడుగా ఉంటాను సరేనా? ఇంతకీ ఎందుకొచ్చిందా సందేహం?"

"నేను స్వార్థంకొద్దీ ఇలా అడుగుతున్నా కదా?"

"ఛ! అవేం మాటలు జ్యోతి...నీ జీవితం సంతోషంగా ఉండడానికి నేనేం చెయ్యటానికైనా సిద్ధమే"-ఆమె గొంతులో నిండుగా చెల్లెలిమీద ప్రేమ తొణికిసలాడింది.

"ఇంతకీ నిన్న కళాధర్ వచ్చాడు కదా...విశేషాలు చెప్పలేదు నాతో"...చనువుగా జ్యోతి వీపు నిమిరింది.

కళాధర్ చెప్పిన విషయాలన్నీ అక్కతో చెప్పి సిగ్గుతో పరవశించి పోయింది జ్యోతి! "జ్యోతీ! నీ జీవితం కళకళలాడటానికి నా ప్రాణం ఇమ్మన్నా ఇస్తానే!" పట్టరాని ప్రేమతో చెల్లెలిని కౌగిలించుకుంది శారద.

"ఛ! అవేంమాటలు అక్కా! నాకోసం నువ్విలా మోడుగా ఉండిపోతానంటే నే ఒప్పుకుంటానా? నాకు కళ్ళు

వస్తే నేను చూడాలనుకునే మొదటి దృశ్యం ఏవిటో తెలుసా?—"

జ్యోతి ఏం చెబుతుందోనని ఊపిరి బిగబట్టి వింటోంది.

"నీదివ్య మంగళ స్వరూపం! నిన్నూ కృష్ణమోహన్ బావనీ పక్క పక్కనే—ఆదిదంపతుల్లా చూసి—"

"జ్యోతీ! నిజంగా అలా జరుగుతుందంటావా?"

"తప్పకుండా అక్కా! నీ మనసులో అమృతం ఉంది నీ కళ్ళల్లో అనురాగపు వెల్లువ వుంది. నేను మనస్ఫూర్తిగా కోరుకునే ఈ కోరిక తప్పక నెరవేరుతుంది—నిజంగా నా కలల నిండుగా—నీ మోహన రూపమే అక్కా—"

జ్యోతి ప్రేమగా శారదని కౌగిలించుకుంది. అప్పుడే గదిలో కొచ్చిన మంజుల అక్కల అన్యోన్యత చూసి సంతోష పడింది. కానీ—తండ్రి మథన పడుతున్న సమస్య ఆమె మనసులోనూ ముల్లులా గుచ్చుకుంటూనే ఉంది.

ఈ కష్టాలనేవి కొండల్లా బరువుగా వచ్చి, మబ్బుల్లా హాయిగా తేలి పోతాయి. అన్నాడో మహాకవి! జీవితంలో అలా జరిగితే ఎంత బావుంటుంది?

నిత్యం జరిగే ఈ జీవన సంగ్రామంలో ఎన్ని జీవితాలు నలిగి పోతేనో; మరెన్నో హృదయాలు పగిలి పోతేనో—కొన్ని జీవితాలు వికసించేది?—గడ్డిపరకకు జన్మ ఇవ్వడానికి పుడమితల్లి ఎంత శ్రమ పడాలో—ఒక సమస్య పరిష్కారానికి ఒక హృదయమూ అంతగా వ్యథ చెందాలి?

# 11

కళాధర్ తండ్రి మధ్యవర్తిని పంపించాడు జానకి రామయ్య దగ్గరికి. ఆ మధ్యవర్తి చెప్పిన మాటలు, అందించిన సందేశం విని స్థాణువులా కూర్చుండి పోయారాయన.

మధ్యవర్తిగా వచ్చిన సుందర రామయ్యని కాఫీ ఫలహారాలతో సత్కరించింది లలితమ్మ. ఏ విషయమూ ఆలోచించి చెబుతానని చేతులు జోడించారు జానకి రామయ్య.

"బాగా ఆలోచించండి జానకి రామయ్యగారూ! గుడ్డి పిల్లకి పెళ్ళికావటం ఎంత కష్టం? అతడేదో మోజుకొద్దీ చేసుకుంటా నంటున్నాడు. ఇహ వాడిమాట కాదనలేక తల్లి దండ్రులు ఊఁ అన్నారు. నిజంగా మీరు—ముఖ్యంగా అమ్మాయి అదృష్టవంతురాలు—అయిదు వేలు కట్నం—మీకు కొంచెం ఎక్కువే అనుకోండి—తప్పదు మరి—ఆడపిల్లలను కన్నాక—ఎలాగో తంటాలు పడండి మరి? మీరు కాదంటే వాళ్ళకి పదివేల దాకా ఇచ్చే వాళ్ళున్నారు—

ఇదంతా అబ్బాయి పట్టుదల—మరి నే వస్తా!"...అంటూ సెలవు తీసుకున్నాడు పెద్దమనిషి.

లలితమ్మ గుమ్మానికెదురుగా కూర్చుని ఆలోచనలో మునిగి పోయింది. జానకి రామయ్య బరువెక్కిన హృదయంతో కళ్ళు మూసుకున్నారు. ఇంట్లో వాతావరణం చాలా గంభీరంగా మారిపోయింది. ఎవరూ ఆయన్ని పలకరించటానికి సాహసించలేదు.

ఆయన మనసులో ఒకటే హోరు—అయిదు వేలు-పైగా లాంఛనాలు-మొన్న సరస్వతిని చూడడానికి వచ్చినవాళ్ళు అయిదు వేలు అడిగారు—పదివేలిస్తే శారదని చేసుకోటానికి కృష్ణమోహన్ తల్లి సుశీలమ్మ సుముఖంగా ఉందని-ఎవరో మధ్యవర్తి చెప్పగా విన్నారాయన-

ఇన్ని వేలు ఎక్కణ్ణుంచి తేవటం? ఈ ఆడపిల్లల్ని ఎలా గడపదాటించటం?

సరస్వతికి చూసిన సంబంధాల్లో గ్రాడ్యుయేట్స్‌ని వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. అటు వంటి పరిస్థితుల్లో మంజుల బి. ఏ. చదువుతోంది. ఆమెకి ఏ ఎమ్మే వాణ్ణో తేవాలి? తనకు సాధ్యమౌతుందా? ఈ సమస్యలవలయానికి అంతం లేదా? ఆడపిల్లల తండ్రి అంతరంగంలోని ఆవేదన అర్థం చేసుకోటానికి ఒక్కరూ ముందుకు రారా?

పోయిన చోటల్లా-అతగాడికో చెల్లెలూ-ఆ చెల్లెలి కోసం ఇతను కట్నం అడుగుతాడు. ఈ చెల్లెల్నిచ్చిన అతనికింకో చెల్లెలు-ఆమె పెళ్ళికి కట్నం? ఈ గొలుసు ఆగే

దెక్కడ? ఈ చక్రభ్రమణం ఆగేదెప్పుడు? ఆయన మనసు ఆలోచనలభారంతో అలిసి పోయింది. శారద వచ్చి "మంచి నీళ్ళు నాన్నగారూ?" అనే వరకూ ఆయన ఈ లోకంలోకి రాలేక పోయారు.

"ఏం చేద్దామనుకుంటున్నారు?" లలితమ్మ నీరసంగా అడిగింది.

"ఏముంది అప్పు చేయటమే"-చిత్రంగా నవ్వారు

"దేనికి నాన్నగారూ అప్పు!" శారద భయపడుతూ అడిగింది.

"జ్యోతికి కట్నం ఇవ్వాలమ్మా-అయిదు వేలు—పెళ్ళికి ఎంతలేదన్నా అయిదు వేలవుతుంది. ఆపైన ఆపరేషన్ ఖర్చులు మనమే భరించాలి" సాలోచనగా కుమార్తె ముఖం లోకి చూశారు.

"ఎంత ఖర్చయినా ఫరవాలేదు. దాని జీవితం బాగు పడుతుంది అది చాలు మనకు-"

"నిజమేనమ్మా-ఉన్నదంతా ఈ ఒక్క పిల్లకీ ఖర్చు చేస్తే—తక్కిన వాళ్ళగతి? ఒక్కగా నొక్కడు వాడికేం మిగి ల్చేది?" ఆయన ముఖంలో ఆవేదన.

నిప్పురవ్వల్లా తగిలాయా మాటలు శారద హృదయా నికి కొంచెం సేపు ఆలోచించింది.

"నా నగలు అమ్మండి నాన్నగారూ-నేనూ బేంక్‌లో

వేసింది రెండువేల దాకా ఉంది. నెమ్మదిగా అంది.

ఇద్దరూ తెల్లబోయి ఆమె వంక చూశారు. "ఆన గలు-డబ్బు- నీ భవిష్యత్తుకమ్మా-" బరువుగా అన్నారు.

"నాకు భవిష్యత్తేమిటి? మంచో-చెడో-నా జీవితం ఇలా అయిపోయింది. దాన్ని గురించి ఆలోచించకండి ముందు జరగాల్సినవి చూడండి. నేను మగపిల్లాడినై ఉంటే ఈ బాధ్యతంతా నాదేగదా?-"

శారదకిన్ని మాటలొచ్చునని లలితమ్మ ఎప్పుడూ ఊహించలేదు.

ఆయనలో ఘర్షణ ప్రారంభమైంది. చాలాసేపు ఆలోచించిన మీదట ఒక స్థిరనిశ్చయానికొచ్చారు. "లలితా సత్తెనపల్లిలో ఉన్న ఇల్లమ్మేస్తాను." అన్నారు. అలా అంటున్నపుడు ఆయన గొంతు తడబడింది.

ఉలిక్కిపడి చూసిందామె. "మగపిల్లవాడు వాడి కేమీ మిగల్చరా?" నిష్ఠూరంగా అంది.

"నాన్నగారూ! నా మాట వినండి. ఇల్లు అమ్మొద్దు. అది తమ్ముడికుండనివ్వండి. ఈ నగలతో"

"శారదా!" ...కోపంగా చూసారాయన. "ఇంకో సారి నాముందు ఇలా మాట్లాడకు. మీ పెళ్ళిళ్ళు చేయ లేనంత అసమర్థుడ్ని కాదమ్మా" ఎర్రబడ్డ ఆయన కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి.

# 12

సాయం సంధ్యని తనివితీరా చూస్తూ డాబా మీద వెల్లకిలా పడుకున్నారు జానకి రామయ్య. కరివేపాకు చెట్టు మీద కాకి ఒకటే గోల చేస్తోంది పడిపోయిన గూడుచూసు కుని. డాబామీదకి ఎగ్రబాకిన మాలతీ లత గుత్తులు గుత్తు లుగా విరబూసి మధుర పరిమళాలు నలువైపులా వెదజల్లు తోంది. కొంగలు బారులు తీరి ఆకాశాన ఎగురుతున్నాయి, దేవకాంతలు ధరించిన మల్లె మాలలు కిందకి జారుతున్నట్లు!

జ్యోతిర్మయి వివాహం కావటంతో ఆయనకి కొండంతబరువు తలమీదనుంచి దింపినట్లయింది. ఇల్లుఅమ్మాయా ల్సొచ్చిందే అన్నబాధ మనసులో పీకుతున్నా, జ్యోతి మొహంలో వెలుగుతున్న అపూర్వమైన ఆనందతరంగాల్ని చూశాక బాధ మరచి పోగలిగారు.

చెల్లెలికితోడు ఉండాలని కొన్నాళ్ళు సెలవు పెట్టి వెళ్ళింది శారద జ్యోతితో హైదరాబాదు. ఆ ఇద్దరూ వెళ్ళి పోయాక ఇల్లంతా శూన్యం అనిపించింది ఆ దంపతులకి.

బోసిగా భావురుమంటున్న యిల్లు చూస్తుంటే ఏడుపొస్తోంది మంజులకి. శారద వెళ్ళిపోవటంతో చేయిపడిపోయినట్లుగా ఉంది లలితమ్మకి. ప్రతి పనిలోనూ శారదే గుర్తుకు వచ్చేది. ఆమెకి దుఃఖం ఆగటంలేదు ఈరోజు. భర్తకి చెప్పుకోవా లన్నా ఆయన గంభీరంగా వుండటం చూసి ఏం మాట్లాడ లేక పోయింది.

మంజుల కాలేజినుంచి వచ్చి మొహం కడుక్కుని తండ్రికెదురుగా కూర్చుంది. ఇవాళ కాలేజిలో ఏంజరిగిందో తెలుసా నాన్నగారూ!" అంటూ ఉత్సాహంగా కబుర్లు మొదలుపెట్టింది.

"ఇంతాలస్యం అయిందేం డిబేటులో పాల్గొన్నావా?" అడిగారాయన.

"అవును నాన్నగారూ! వర్ణాంతర వివాహాల మీద చర్చ! చాలాబాగా జరిగింది. మా క్లాసులో నలుగురు మాట్లాడారు. మీరు రాలేదేం?"

"తలనొప్పిగా వుండి వచ్చేశాను. నువుమాట్లాడావా మరి?"

"ఆఁ" అంది ఉత్సాహంగా.

"వర్ణాంతర వివాహాలు చెయ్యమన్నావా మరి?" నవ్వుతూ చూశారు కూతురివంక.

"లక్షణంగా నాన్నా!" ఆమె గారాబం ఎక్కువైన ప్పుడు నాన్నా అని పిలుస్తుంటుంది.

"మీలాగా నాకూ ఇంతమంది ఆడపిల్లలుంటే... నచ్చినవాడైతే సరే...ఏ కులం వాడికైనా ఇచ్చిచేసే దాన్ని"—ఉత్సాహంగా అంది.

ఆయన మొహం గంభీరంగా మారిపోవటం గమనించని ఆమె తన ధోరణిలో చెప్పుకు పోతోంది.

"నిజానికి మన పూర్వీకులే మంచి మంచి సంస్కర్తలేమో అనిపిస్తుంది ప్రేమ కలిగిందే చాలని...పరాశరుడు మత్స్య గంధిని కుంపరరీగా అయినా చేసుకున్నాడా?—జాతి కాకపోయినా ... అర్జునుడు ఉలూచిని పెళ్ళిచేసుకున్నాడా?—మనం కొన్ని చాదస్తాలు వదిలి పెడితే గానీ—ముందుకు పోలేం."

"ఆఁ చాలుగానీ—కిందకుపోయి కొంచెం కాఫీ తీసుకురా తలనొప్పిగారు వుంది"—ఎర్రబడిన ఆయన మొహంలోని భావాలేవిటో సరిగా కనిపెట్టలేక పోయింది మంజుల.

మౌనంగా కిందకెళ్ళి కాఫీ తీసుకొచ్చి తండ్రికిచ్చింది.

"ఎంత సేపటికీ యీ అతివాగుడేనా? చదువు సక్రమంగా సాగిస్తున్నావా లేదా? ఆలోచనలు ఇలా ప్రవహింపచేలా చేసావంటే మనసు నీ అదుపులో వుండదు. ఇలాటి విషయాలన్నీ తేలిగ్గాతీసుకోవాలిగానీ...సీరియస్‌గా ఆలోచించకూడదు" కాఫీ గ్లాసు మంజుల చేతికిస్తూ హితోపదేశం చేస్తున్నట్లు చెప్పారు.

తండ్రి ఇంత హఠాత్తుగా ఎందుకు మారిపోయాడో అర్థంకాక తికమక పడిపోయిందామె మనసు.

# 13

హైదరాబాదునుంచి కాళిదాసు వచ్చాడు. అక్కడ నుంచి బోలెడు కబుర్లు మోసుకొచ్చాడు. మంజుల సరస్వతి వసుధ అన్నగారి చుట్టూచేరి, హైదరాబాదు విశేషాలు, జ్యోతి కాపురం గురించి బావగారి మంచితనం గురించి అడిగి చెప్పించు కుంటున్నారు.

లలితమ్మ వంటింట్లో నుంచి పని ముగించుకుని వచ్చి చేతులు తుడుచుకుంటూ వాళ్ళ ఎదురుగా కూచుంది.

ఈ మధ్య జ్యోతి అత్తగారు హైదరాబాదు వచ్చిందటగా, ఆవిడొచ్చినపుడు నువ్వెళ్ళావా? అడిగింది కొడుకు మొహంలోకి పరిశీలనగా చూస్తూ.

వియ్యపురాలు పెళ్ళిలో అన్న సూటిపోటీ మాటలు ఆవిడింకా మర్చిపోలేక పోయింది. "మా వాడు ఊం— ఇదయి పోతున్నాడు గానీ— లేకపోతే పదివేలు కట్నం గుమ్మరించే వాళ్ళు— ఏం ఖర్మ చెప్పండి? ఈ గుడ్డిదాన్ని చేసుకోవాలని— అంతా విచిత్రమమ్మా— లలాట లిఖితం"—

అంటూ నుదురు కొట్టుకుంది. చుట్టూ చేరిన ఆడంగులు బోలెడు సానుభూతి కురిపించారు ఆవిడమీద. అటూ ఇటూ పనిమీద తిరుగుతున్న లలితమ్మ చెవిన ఈ మాటలు పడనే పడ్డాయి. మనసు చివుక్కుమనిపించింది.

అత్తగారికిపెట్టినచీర బాగాలేదని సణుగుడు మొదలు పెట్టింది జ్యోతి అత్తగారు మంగమ్మ. అప్పటి కప్పుడు జానకిరామయ్య ఉరుకులు పరుగుఃమీద బజారెళ్ళి ధర్మవరం పట్టుచీర తీసుకొచ్చారు. అది చూశాకగానీ ఆవిడ ముఖం వికసించలేదు.

ఆడపడుచులు చిన్నగా అలక సాగించబోయారు గానీ కళాధర్ సాగనివ్వలేదు.

"రేపు మీరూ—ఇంకోఇంటికి పోవాలి—మనసు ఇట్లాంటిబాధ తప్పదు-ఏవో మూర్ఖపు ఆచారాలు పట్టుకుని చదువూ సంస్కారం ఉన్న మనంకూడా ఇలా ప్రవర్తిస్తే ఎలా?" అని మెత్తగా మందలిస్తూ చెల్లెళ్ళకి సర్ది చెప్పాడు.

మాటకిముందు "గుడ్డిపిల్ల, గుడ్డిపిల్ల" అంటూ ఆవిడ ఎత్తిపొడవటం భరించలేకపోయింది లలితమ్మ. కళాధర్‌కి తల్లి ప్రవర్తన నచ్చలేదు. పక్కకి పిలిచి ఎవరూ చూడకుండా తల్లిని గట్టిగా మందలించాడు. అప్పుడు కానీ— ఆవిడనోరు మూతపడలేదు.

ఇవన్నీ తలుచుకుని లలితమ్మ మనసు దిగులుతో నిండిపోయింది. "పిచ్చి పిల్ల! ఎట్లా చేస్తున్నదో ఏమో! శారద

ఉన్నది కాబట్టి కొంత ధైర్యం" మనసులో అనుకోబోయి పైకే అనేసింది.

"ఏవిటిమ్మా! నీలో నువ్వే మాట్లాడుకుంటున్నావ్?" కాళిదాసు తెల్లబోయి చూశాడు.

"ఏం లేదురా... శారద మళ్ళీ ఏదన్నా గొడవ చేసిందా మంగమ్మ వచ్చినప్పుడు."

కాళిదాసు ముఖం బాధతో నల్లబడిపోయింది.

"కళాధర్ పట్టుబట్టటంతో హైదరాబాదు వెళ్ళిన దగ్గరనుంచీ బొట్టు, పూలు పెట్టుకుంటున్నది అక్క."

"అదేమిట్రా... ఆ మహాకాళి ఊరుకుంటుందీ?" ఆమె మనసు భయంతో దడ దడ మంది.

"ఎందుకూరుకుంటుందీ? ముష్టి సంబంధం చేశారు, ఆచారం లేదు—సాంప్రదాయం లేదు—లక్షణమైన పిల్లాడికి గుడ్డిదాన్నేసి కట్టారు అని సణుగుతూనే ఉందట. శారదక్క లోలోపలే కుమిలిపోయింది. జ్యోతి కోసం గుండె దిటవు చేసుకుని ఉంటున్నది. ఎటూ సెలవలు అయిపోవచ్చినయ్‌గా వచ్చేస్తుంది లే."

"జ్యోతి ఒక్కతే ఎలా ఉంటుందిరా?"

"తప్పదమ్మా మరి? వాళ్ళకి దూరపుబంధువు ఒకామె ఉందట—విధవామె ఆమెను తీసుకొస్తాను అంటున్నాడు కళాధర్."

"కృష్ణమోహన్ బావ ఆ మధ్య లెటర్ రాశాడు తనకి హైదరాబాదు ట్రాన్స్ఫరయ్యే సూచనలున్నాయని."

"ఏమోరా—దాని అదృష్టం ఎట్లా వుందో—దాని రాతట్లా తెల్లారాలని రాశాడు ఆ భగవంతుడు. కృష్ణ చేసుకుంటానన్నా-ఆ మహాతల్లి మీ సుశీలమ్మత్త పడనివ్వద్దూ" దీర్ఘంగా నిట్టూర్చింది.

"ఇంతకీ నాన్నగారు నన్నెందుకు రమ్మని రాసినట్లు" కాళిదాసు తన సందేహం బయటపెట్టాడు.

"పెళ్ళిచూపులకి" నవ్వింది మంజుల.

"ఎవరికే? నీకా? నాకా?" చెల్లెల్ని ఉడికించబోయాడు.

"నాకేం కాదు నీకే! గుడివాడ అమ్మాయి పి. యు. సి. వరకు చదివింది. వంటా వార్పు చేస్తుంది. అన్నయ్య పెళ్ళికొడుకాయెనే—మా వదినవల్లో వచ్చిపోయెనే" మంజుల అల్లరిగా బయటికి పరిగెత్తింది.

"ఉండు మొద్దూ! నీ పని చెబుతాను" కాళిదాసు కూర్చున్నవాడల్లా లేచి చెల్లెలివెంట పడ్డాడు. ఎదురుగా తండ్రి రావటం జూసి హఠాత్తుగా ఆగిపోయాడు.

కొడుకునుచూడగానే ఆయన మొహం సంతోషంతో విప్పారింది. కొడుకుని ఎదురుగా కూర్చోబెట్టుకుని విశేషాలన్నీ అడిగి తెలుసుకున్నారు. శారద విషయం వినగానే ఆయన హృదయం బాధతో నలిగిపోయింది.

"నేను అమ్మతో క్లియర్‌గా చెప్పలేదుగానీ--జ్యోతి అత్తగారు శారదక్కని అనరానిమాటలు అన్నది. ఈ విష

యాలన్నీ కళాకి తెలియవు. చెప్తే అమ్మా కొడుకులకి తగూలు పెట్టినట్లవుతుందేమోనని జ్యోతి ఫూరుకుంటుంది. శారదక్క ఒట్టి పిచ్చిది—జ్యోతి కోసం ఎన్ని అవమానా లయినా భరిస్తూ అక్కడే ఉంటానంటుంది" కాళిదాసు ఆవేదనగా చెప్పుకుపోతున్నాడు. ఆయన హృదయాన్నెవరో సమ్మెటలతో కొడుతున్నంత బాధగా అనిపించింది. కొంచెం సేపు కళ్ళు మూసుకుని అలా ఉండిపోయారు. శారదరూపం కళ్ళముందు కదిలి ఆయన మనసు నిగ్రహించుకోలేక పోయారు. తనను తాను సంబాళించుకోటానికి చాలా సేపు పట్టింది.

"గుడివాడనుంచి రామాచారిగారు లెటర్ రాశారు. రేపు అమ్మా నువ్వూ వెళ్ళి పిల్లని చూసిరండి" అన్నారు మెల్లిగా తేరుకుని.

"ఇప్పుడు నా పెళ్ళికేం తొందర?" నెమ్మదిగా అన్నాడు తండ్రివంక సూటిగా చూడకుండా.

"నీకు తొందరలేదు అవతల వాళ్ళు తొందరపడు తున్నారు. అతను నా చిన్ననాటి స్నేహితుడు-నీకు పిల్ల నచ్చితే-తరవాత చూద్దాం-నాకు రాబోయేది ఒక్క కోడలే ఎన్నో ఆశలున్నాయి అవి నెరవేరే యోగం ఉందో లేదో మరి?-"

ఇంతలో లలితమ్మ రానే వచ్చింది. "చూశావురా-కాళీ మీ నాన్నగారి ధోరణి: పదివేలు దాకా కట్నం ఇస్తామని-ఎంత మందో తిరిగి పోతున్నారు. ఈయన మాత్రం మడికట్టుక్కూర్చున్నారు-కట్నం వద్దని-మనల్ని ఎవరైనా

జాలితలిచారా? చివరకి వున్న ఒక్క ఆధారం ఆ ఇల్లు కూడా అమ్ముకున్నాం-" ఆమె కళ్ళల్లో నుంచి అప్రయత్నంగా నీళ్ళు జల జలా రాలిపోయాయి.

ఆ ఇంటిలో తను గడిపిన కొన్ని మహత్తరమైన క్షణాలు ఆమె మర్చిపోలేక పోతోంది. జానకిరామయ్య తల్లి బ్రతికున్న రోజుల్లో కోడల్ని ఎంతో అపురూపంగా చూసుకున్నది. ఆ ఇంటితో పెనవేసుకున్న ఎన్నో స్మృతులు ఆమెకి ఎంతో అపురూపంగా అనిపిస్తాయి. అందుకే ఆ ఇల్లు అమ్మటం ఆమెకిష్టంలేదు.

కాళిదాసుకిచ్చే కట్నంతో ఒక ఇల్లయినా కొనాలి- లేదా ఒక పిల్ల పెళ్ళయినా చెయ్యాలని ఆమె కోరిక ఆమె కోరికలకి ఆనకట్ట కడుతూ నిలిచింది ఆయన ఆశయం-

పెళ్ళయిన కొత్తల్లో వంటినిండా నగలతో అపర లక్ష్మీ దేవిలా ఉండేది లలితమ్మ. కనకదుర్గ, త్రిపురసుందరి పెళ్ళిళ్ళతో ఆమె నగలు అదృశ్యమైనాయి.

ఇదుగో-అదుగో చేయిస్తాను అని ఆయన అంటూనే ఉన్నారు- కాలం కరిగి పోతూనే ఉంది. ఆమె మనసు ఈ బాధలతో బరువులతో నిండిపోయి, ఆ నగలమోజు క్రమ క్రమంగా వెనకబడింది. ఎదిగిన కొడుకు పెళ్ళి అనే సరికి- ఆమెలో వెనకటి కోర్కె పడగ విప్పింది.

కొడుకైనా తన కోరిక మన్నిస్తాడని ఆశగా ఆనందంగా అతని వంక చూసింది.

"ఊరంతా ఒకదారైతే ఉలిపి కట్టెదొకదారి అన్నట్లు ఈయన నా మాట వింటంలేదు. నువ్వయినా

చెప్పరా...ఆ గుడివాడ వాళ్లు ఏం ఇవ్వలేరు నాకు తెలుసు వాళ్ళస్థితి గతులు. ఆ-కందుకూరు వాళ్లయితే పదివేలిస్తామన్నారు" ఆమె కళ్ళు ఒక్క క్షణం తళుక్కుమన్నాయి.

జానకి రామయ్య కొడుకు మొహంలోకే గుచ్చి గుచ్చి చూస్తున్నారు-తల్లి మాటలు అతనిమీద ఎలా ప్రభావం చూపిస్తాయోనని-తల్లిని తండ్రిని మార్చి మార్చి చూస్తూ ఆలోచనలోపడి పోయాడు కాళిదాసు.

కొడుకు తన మాటే వింటాడని ఆమె హృదయం నమ్ముతున్నది. "ఏరా కాళీ! కందుకూరు వెళ్ళి పిల్లని చూసొద్దామా?"

"చూడక్కర్లేదురా!—నల్లచింతపండులా ఉంటుంది ఆ తరవాత మీ ఇష్టం—"

తండ్రి మాటలకి ఫక్కుమని నవ్వేశాడతను.

"మీదంతా వేళా కోళం—నలుపైతే ఏం?" రెట్టించింది భర్తని.

"ఈ ఇంటికి రాబోయే కోడలు దీపంలా ఉండాలే—నా బిడ్డలందరూ రత్నాలు...వాళ్ళ పక్కని నిల్చోడానికైనా అర్హత ఉండొద్దూ?" తండ్రి మాటలు సూటిగా కాళిదాసు హృదయంలో నాటుకున్నాయి.

"అమ్మా! సరస్వతికి కట్నం ఎక్కువడుగు తున్నారని నువ్వూ నాన్నగారూ బాధ పట్టంలేదూ? తెలిసే ఇంకో ఆడపిల్ల తండ్రి నెందుకు బాధ పెట్టడం? నాన్నగారికి కవిగా రచయితగా ఒక స్థానం ఉంది ఈ సంఘంలో! ఆయన ఆశయాన్ని కాదని మనం డబ్బుకోసం ఎగబడటం అంత బావుం

డదేమో!" తల్లి వంక తిరిగి ప్రశాంతంగా అన్నాడు.

కొడుకు తన మాట వింటాడని ఆశగా ఎదురుచూసిన లలితమ్మ ఈ మాటలు విని హతాశురాలైంది. "నామాట ఎప్పుడు సాగింది గనక ఈ ఇంట్లో" గొణుక్కుంటూ వెళ్ళి పోయింది లోపలికి.

"నేనెంత కట్నం తీసుకుంటానో అని మన బంధువు లంతా ఎదురు చూస్తున్నారు నవ్వుతూ కొడుకు వంక చూశారు.

"సరస్వతి పెళ్ళయ్యే వరకూ ఆగుదామను కుంటు న్నాను—"

"ఆగటం ఎందుకు నాయనా? కుదిరితే రెండూ ఒక సారే చేస్తాను. నీకెందుకు అవన్నీ నే చూసుకుంటాగా! నువ్వెళ్ళి పిల్లని చూసిరా—"

"కృష్ణబావ మొన్న ఉత్తరం రాశాడు నాకు-"

"ఏవిటి విశేషం?" కొంచంసేపు తటపటాయించి చివరికి చెప్పేశాడు.

"హైదరాబాదు ట్రాన్స్ఫరవగానే శారదక్కని రిజిష్టర్ మారేజ్ చేసుకుంటాట్ట." ఆయన పక్కలో పిడుగు పడితే అదిరి పడ్డట్లు చూశారు.

"ఇది బావుందిరా—వాళ్ళమ్మకేమో ఇష్టంలేదు. నాయనకేమో కట్నాల మీద ఆశ. వీడికేమో శారద మీద ఆశ! తొందరపడి అలాటి పిచ్చి పని చెయ్యొద్దని రాసేయ్-నువ్వు రాయలేక పోతే వాడి అడ్రసివ్వు నేనే రాసి పడేస్తా...సరస్వతి- పెళ్ళి కుదరక నానా తంటాలు పడుతు

న్నాను. వీడీ పని చేశాడంటే...బంధువులంతా ఊరుకుంటారా? నన్ను రాబందుల్లా పొడుచుకు తినరూ"- ఆయన భవిష్యత్తుని ఊహించుకుని భయంతో వణికిపోయారు.

రెండు నెలల క్రితం సరస్వతిని చూడటానికి వచ్చిన వాళ్లు పక్కింటి సూరన్నకి బంధువులు. వాళ్ళది ఏలూరు. ఈ మహాతల్లి వాళ్ళ చెవుల్లో ఏం ఊదిందో ఏమో చూడటాని కొచ్చినావిడ లలితమ్మని మొహానే అడిగేసింది.

"మీ అమ్మాయి బొట్టూ పూలు పెట్టుకు తిరుగుతుందటగా-మళ్ళీ పెళ్ళి చేస్తారా ఏవిటి?"

ఆవిడ తీవ్రమైన చూపుల్నించి తప్పించు కోలేక పోయింది లలితమ్మ.

"అదేవీ లేదండీ-ఎప్పుడన్నా మనసైనప్పుడు బొట్టు పెట్టుకుంటుందంతే-"

"బావుందమ్మోయ్! ఇప్పుడు బొట్టు పెట్టుకుంటుంది రేపు మొగుడ్ని తెమ్మంటుంది. ఇలాంటి సంబంధం చేసుకుంటే మా పరువేం కావాలి?"

వాళ్ళకి కొంచెందూరంలో కూర్చున్న మంజులకి ఒళ్ళు మండిపోయింది ఆవిడమాటలకి. తారాజువ్వలా లేచొచ్చి ఆవిడముందు నిలబడింది.

"అవునండీ! మాఅక్కకి పెళ్ళిచేస్తాం మీకెందుకు మాగోడవ? దానికి పెళ్ళిచేయలేకపోతే...జీవితాంతంమీరు పోషిస్తారాదాన్ని? మీరొచ్చిన పనిచూసుకొని మర్యాదగా అవతలికి నడవండి"

మంజుల మాటలకి ఆ వొచ్చినావిడ తెల్లబోయింది

వాకిట్లో మగవాళ్ళతో మాట్లాడుతున్న జానకిరామయ్య ఇంట్లోకొచ్చారు కంగారుగా ఆయన వెనక పెళ్ళిపెద్దలూ వచ్చారు. మంజుల ఆవేశంతో ఆవిడని మాటలతో రెచ్చగొట్టింది.

పరిస్థితి అర్థంచేసుకుని జానకిరామయ్య కూతురి చెంపలు కందిపోయేలా వాయించేశారు.

కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయిన ఈసంఘటనకి వచ్చినపెళ్ళివారు అదిరిపోయారు. పెళ్ళికొడుకు మాత్రం మంజుల రూపాన్ని ఆమెవాగ్ధాటినీచూసి ముగ్ధుడైపోయాడు. "ఇలాటిసంబంధం అని తెలియక వచ్చాంతల్లీ! బాగా బుద్ధి చెప్పావు" అంటూ వాళ్ళు వచ్చినదారిబట్టారు.

లతమ్మకి కోపంకట్టలు తెంచుకుంది. కాళిదాసువచ్చి ఆపకపోతే...మంజులశవం మాత్రంఉండేది అక్కడ.

ఆసంఘటన తలచుకొని నిలువెల్లావణికిపోయారాయన. తండ్రిబాధ అర్థంచేసుకున్న వాడిలా మొహం మరోపక్కకి తిప్పేసుకున్నాడు. "నాన్నగారూ!" మెల్లిగా పిలిచాడు.

"మనంకొంచెంధైర్యం చెయ్యకపోతే...ఈసమస్యలు పరిష్కారంకావు. మొదట్లోకొత్తగా వింతగా చెప్పుకుంటారు ఆతరువాత మామూలే...కొందరైనాముందడుగేస్తే...మరి కొందరు ఉత్సాహంచూపిస్తారు. అప్పుడు సమాజంమారకేం చేస్తుంది. మొదట్లో ఎదురీదటం మనవంతు... ఆ తరువాత మనల్ని మార్గదర్శకులుగా"...

"వద్దురా కాళీ! మంజులపెళ్ళి అయిపోయేవరకూ శారదనిగురించి ఆలోచించదలచుకోలేదు.

తండ్రినిర్ణయం ఇకమారదని తెలిసి మౌనంవహించాడు.

# 14

కాళిదాసు, లలితమ్మ ,మంజుల ఒకమధ్యవర్తిని తీసుకుని గుడివాడ వెళ్ళారు పెళ్ళిచూపులకి.

వాళ్ళటు వెళ్ళగానే ఒంగోలునుంచిఉత్తరం వచ్చింది సరస్వతిని చూడటానికి ఆరోజేవస్తామని. జానకిరామయ్యకి ఎటూపాలుపోలేదు. ఇంట్లో భార్యలేనిసమయంలో వీళ్ళొస్తే అసలే అమాయకపుపిల్ల ఇవన్నీ ఎలాసమర్ధిస్తుంది. మంజులైనాఉంటే అదోకదారి- వసుధ ఇంకాచిన్నపిల్ల.

తండ్రిచెప్పిన సంగతివినగానే సరస్వతికి గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి. సరస్వతికి కంగారులో ఏంచెయ్యాలో తోచలేదు. ఎదురింట్లోఉన్న పద్మతల్లి స్వరాజ్యాన్ని తోడుగా ఉంటుందని పిలుచుకొచ్చింది.

ఆసాయంత్రానికల్లా చూడటానికొచ్చారు ఒంగోలునుంచి. ఆడవాళ్ళెవరూలేరు. పెళ్ళికొడుకు రామచంద్ర అతనిఇద్దరన్నలు అంతే. పెద్దఆర్భాటంగా రావటంరామచంద్రానికిష్టంలేదు. అతనుకొంచెం అభ్యుదయ భావాలుగల యువకుడు. బి. ఏ. పాసైపూనాలోఉద్యోగం చేస్తున్నాడు.

పెద్దఅందగాడు కాకపోయినా ఆకర్షించే విగ్రహం, వినయం, సంస్కారం అతనిసొత్తు. రామచంద్రదాన్ని చూసి మనసులోనే తృప్తిపడ్డారు జానకిరామయ్య.

ఇంట్లో ఎవరూ లేకుండా పెళ్ళిచూపులంటే సరస్వతికి ఏడుపొస్తోంది. ఇట్లాంటి సమయంలో మంజుల, శారద ఆమెకి ధైర్యంచెప్పి ఉత్సాహపరిచేవాళ్ళు. వాళ్ళిద్దరూ లేని కొరత ఆమెమనసుని బాధిస్తూనే ఉంది.

ఎదురింటామె స్వరాజ్యం సరస్వతి పొడవైన జుట్టుని దువ్వి జడవేసి పూలుపెట్టింది. చేయిపట్టుకొని తీసుకొచ్చి వాళ్ళఎదుట కూచోబెట్టింది.

"అమ్మాయికి పాటలొచ్చా?" పెళ్ళికొడుకు అన్న గారు అడుగుతున్నారు.

"రావండీ!" జానకిరామయ్య తనే సమాధానం చెప్పారు.

"ఇంట్లో బట్టలన్నీ అమ్మాయే కుడుతుంది. వంటల్లో ఫస్టు. మీకు చెప్పాల్సిన పనిలేదు. మీరిప్పుడు తింటున్న క్యారెట్ హల్వా అమ్మాయి చేసింది." ఆయన చమత్కార సంభాషణకి రామచంద్రం చిన్నగానవ్వుకున్నాడు.

"ఏవిటోయ్ నవ్వుకుంటున్నావ్? నేను అతిశయోక్తిగా చెప్పాననుకుంటున్నావా?" చనువుగా అడిగేశారు.

"అబ్బే అదేం లేదండీ!" మొహమాట పడిపోయ్యాడతను.

"నువ్వేమన్నా అడుగుతావేమో అడగరా అమ్మాయిని"... అన్నలిద్దరూ ప్రోత్సహించారుతమ్ముణ్ణి.

అడిగేదేంలేదని చిన్నగా తలవూపాడతను. అతనికి సరస్వతిరూపం నిండుగా అనిపించింది. సన్నగా బలహీనంగా ఉన్న అమ్మాయిలో ఏదో వింతఆకర్షణ. అతనుపెళ్ళిచూపుల పేరుతో ఏపదిమందినో చూసిఉంటాడు. ఎవరిలోనూ ఈఆకర్షణ కనిపించలేదు. ప్రతిసారీ పూనానుంచి రావటం... పిల్ల నచ్చలేదని నిరాశగా తిరిగిపోవటం జరుగుతోంది గతరెండేళ్ళుగా.

ఈసారిమాత్రం అలాకాదు అనుకున్నాడు సంతృప్తి నిండినమనసుతో!

ఆ సాయంత్రమే రామచంద్రం అతనిఅన్నలు తన నిర్ణయం తెలిపారు పిల్లనచ్చిందని. ఇహమిగిలిందల్లా కట్నాలు లాంఛనాలు మాట్లాడుకోవడమే!

రామచంద్రంఅన్నలు చాలాదురాశాపరులుగా కనిపించారు, మీరుపదివేలు కట్నంఇవ్వండి. మేం పదివర్లు సొమ్ముపెడతాం అన్నారులౌక్యంగా.

"మీరు నగలు పెట్టకపోయినా నాకిష్టమే ... రెండు వేలకన్నా ఎక్కువివ్వలేను"—జానకిరామయ్య

"మీరుమరీతక్కువ చెప్తున్నారు— చీమకుర్తివాళ్ళు పదివేలిస్తామన్నారు."అన్నలిద్దరూముక్తకంఠంతో అన్నారు

"చూడండీ కట్నంకాక, లాంఛనాలుపెళ్ళి ఖర్చులు. ఇవన్నీ ఉంటాయికదా... పదివేలుకాకుండా ఉంటుందా?"

"లాభంలేదండీ అయిదువేలకి ఒక్కపైసాతక్కువైనా లాభంలేదు బాగా ఆలోచించుకోండి- తనుతుది నిర్ణయం ఖచ్చితంగా చెప్పేశారు అన్నలు.

ఆయనకి ముచ్చెమటలు పోశాయి.

రామచంద్రం ఏమీ మాట్లాడటం లేదు. తనపని మాపుల వరకే అన్నట్లు ఎటో చూస్తున్నాడు.

ఆయనకి ముచ్చెమటలు పోశాయి. తప్పదు... కుదరక కుదరక సంబంధం కుదిరింది.... దీన్ని చేయిజార్చుకుంటే కష్టం. వాళ్ళడిగిన కట్నానికి సరేననక తప్పలేదు.

దాదాపు అంతా స్థిరపడి పోయినట్లే! ఆరోజే వెళ్ళిపోతామన్నారు గానీ—లలితమ్మ కాళిదాసు వస్తారు ఉండమన్నారు—వాళ్ళు పిల్లాడిని చూసినట్లు వుంటుంది. అందరూ ఔనంటే అదో తృప్తి.

సరస్వతిని గూడా ఒక మాటడిగితే సరిపోతుందనిపించిందాయనకి. "ఏమ్మా నీ కిష్టమేనా?" దగ్గరకి పిలిచి ఆప్యాయంగా అడిగారు. అసలే నోట్లో నాలుక లేని పిల్ల. తనమనసులోని విషయం ఏదీ తొందరపడి బయటకు చెప్పదు. మీ ఇష్టం అనేసి అవతలకెళ్ళి పోయింది.

తండ్రికి అంగీకారం తెలిపింది గానీ మనసు మనసులో లేదామెకి. ఏవేవో ఆలోచనలు మనసుని కలత పెట్టాయి. ఒంటరిగా కూర్చుని తనివిదీరా ఏడ్చింది. చిన్నతనం నుంచీ పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రుల్ని, ప్రేమానురాగాలతో చూసుకుంటున్న తోబుట్టువులనీ వదిలి, ఎవరో అపరిచిత వ్యక్తితో జీవితం సాగించాలి.

వివాహం స్త్రీ జీవితంలో ఓ ముఖ్యమైన మలుపు. ఆ మలుపు తిరిగితే ఎదురయ్యేవి, ముళ్ళలో! గులాబీ తోటలో! ఈ మమతాను బంధాలన్నీ తెంచుకొని ఎలా వెళ్ళి

పోవటం? ఆ కొత్త వ్యక్తి ఎలాటివాడో? తనను సహృదయంతో ఆదరిస్తాడా? ఆలోచనలతో అలసిపోయి ఏ అర్ధరాత్రికో నిద్రపోయిందా కన్నె మనసు!

మర్నాడు ఉదయం సాయంత్రం కల్లా కాళిదాసు, లలితమ్మ మంజులా వచ్చేశారు. వస్తూనే కొత్త వ్యక్తుల్ని చూసి విషయమంతా గ్రహించింది మంజుల.

ఇంత తొందరగా సరస్వతికి ఈ సంబంధం కుదరటం సంతోషమనిపించింది లలితమ్మకు "మనం ఎన్ని ప్రయత్నాలు చేస్తే ఏం ఆ ఘడియ రావద్దూ! పిచ్చి పిల్లనే లేకుండా ఇదంతా జరిగిందని ఎంత బెంగ పడిందో"అనుకుంది ప్రేమగా సరస్వతి దగ్గరకు తీసుకుంటూ.

కాళిదాసు కాఫీ తాగేసి కాబోయే బావగారితో కబుర్లలోకి దిగిపోయాడు. అయిదు నిమిషాల్లో పరమ ఆప్తు కలిసి పోయారు వారిద్దరూ!

మాట్లాడుతున్న అన్నగార్ని చాటుగా సైగచేసి లోపలికి పిలిచింది మంజుల. అతను విసుక్కుంటూ లోపలికొచ్చాడు.

"అన్నయ్యా—బావగారు మంచివారేనా? బాగా మాట్లాడతారా? పూనాలో ఉండే వాళ్ళకి ఎన్ని అలవాట్లు ఉంటాయో ఏమో!" అంది మంజుల దిగులుగా బాధతో.

"నువ్వు అతి తెలివి ప్రదర్శించకు. సంస్కారం ఉన్న వాడిలానే ఉన్నాడు. నీలాగ అతివాగుడుకాయ మాత్రం కాదు"—కాళిదాసు

"ఆఁ సంస్కారం కనిపిస్తూనే ఉంది, అయిదు వేలు" అంది వెటకారంగా చూపిస్తూ.

"ఛ! నోర్మూయ్! అవతల అతనికి వినిపిస్తే ఏమనుకుంటాడూ?"

"ఆహాఁ—ఏమనుకోడు—తీసుకుంటే లేదు గానీ—అంటే వచ్చిందా?"

"అబ్బబ్బ నీ గోల నీదే—చిన్నప్పుడే వాళ్ల నాన్న గారు పోతే అన్నగార్లు చేరదీసి చదివించారు."

"ఓహో! అందుకని ఆ చదువు చెప్పించిన డబ్బంతా అణా పైసలతో సహా వసూలు చేస్తున్నారు అంతేనా?"

"మనంఆదర్శాలు పెట్టుకూర్చుంటే—ఎవరూ మన మొహం చూడరు తెలుసా? రేపు నీ కెంత ఇవ్వాలో అది చూడు"—చెల్లెల్ని ఉడికించ బోయాడు.

"నాకా?" మంజుల మొహం గంభీరంగా మారిపోయింది.

"కట్నం తీసుకునేవాణ్ణి నే ఛస్తే పెళ్ళి చేసుకోను"—

"సరే—అదీ చూద్దాంగా—కట్నమిచ్చి వరుళ్ళని కొనుక్కునే వాళ్లందరూ పిచ్చివాళ్లంటావ్?"

"పిచ్చివాళ్ళు కాదు గొర్రెలు—అర్థంలేని సాంప్రదాయాలు పట్టుకుని ఒకరివెంట ఒకరు అయోమయంగా నడిచి పోయే గుడ్డివాళ్లంటాను.

"అబ్బబ్బ ! నోరు ముయ్యవే తల్లీ! నీ పెళ్ళి నీ ఇష్టం వచ్చినట్లు చేసుకుందుగానీ—నన్ను వెళ్లనియ్! అతనొక్కడే కూర్చున్నాడు. పెండ్లయిపోయినాక అతనితో చెయ్యి

ఇలాంటి చర్చలన్నీ"... కాళిదాసు వెళ్ళిపోయాడు హాల్లోకి.

"మంజులా! బావగార్ని చూశావుటే"—లలితమ్మ నవ్వుతూ అంది.

"నేనెందుకు చూడటం? నేనా చేసుకునేది?" పెంకెగా అంది.

అయిదువేలు కట్నం అనేమాట ఆ పిల్ల మనసుని భగభగా మండిస్తున్నది. జ్యోతి పెళ్ళయి ఆ షాక్ నుంచి తేరుకోక ముందే ఇంకో ఉప్పెన—అప్పుల అలజడి.

"అక్కా వాళ్ళు వెళుతున్నారు చూద్దుగానిరా" వసుధ వచ్చి చేయిపట్టి లాక్కెళ్ళి చూపించింది.

పాంటు షర్టు వేసుకొని తలదువ్వుకుంటున్నాడు రామచంద్రం! అక్క అదృష్టవంతురాలు అనుకుంది మనసులోనే. అతని రూపంలానే హృదయం కూడా సుందరంగా ఉండాలని భగవంతుణ్ని ప్రార్థించింది.

# 15

అన్ని విషయాలు పూర్తిగా మాట్లాడుకుని ముహూర్తాలు పెట్టుకుని వెళ్ళిపోయారు రామచంద్రం అన్నలు ముకుంద రావు, జగన్నాథం. పెళ్ళికి వ్యవధి ఇరవయి రోజులే. పను

లన్నీ చక చకా జరిగి పోతున్నాయి. హైదరాబాదు నుంచి శారద వచ్చేసింది, జ్యోతి దగ్గర దూరపు బంధువొకావిడని సాయంగా వుంచి. ఆమెకి కళాధర్ మీద మంచి విశ్వాసం. ఎందరు పుల్ల విరుపు మాటలు మాట్లాడినా...అతనికి భార్య మీద గల ప్రేమ మంచులో మల్లెపూవ్వంతస్వచ్ఛమైనది. చెల్లెలికాపురం సంతోషంగా ప్రశాంతంగా గడిచిపోతుంటే శారద హృదయం ఎంతో తేలికపడింది.

జ్యోతి కళ్ళకి ఆపరేషన్ చేస్తానన్న ఐ స్పెషలిష్టు ప్రస్తుతం ఫారిన్‌లో ఉన్నాడు. ఆయన తిరిగి రాగానే ఆపరేషను చేయించాలని వేయి కళ్ళతో ఎదురు జూస్తున్నాడు కళాధర్. హైదరాబాదు విశేషాలన్నీ శ్రద్ధగా విని సంతోషించాడు జానకిరామయ్య.

తమ్ముడు పెళ్ళిచూపులకి వెళ్ళి వచ్చాడనివిని శారద అడిగింది "ఏరా పిల్ల బావుందా?"

"నాకేమీ నచ్చలేదే?" అతనుఉదాసీనంగాఅన్నాడు అన్నగారికి అమ్మాయి నచ్చలేదని గుడివాడలోనే గ్రహించింది మంజుల.

"పోనీలే వాడికేం తొందర" అని సరిపెట్టుకున్నారు అందరూ. మళ్ళీ పెళ్ళి నాటికి వస్తానంటూ హైదరాబాదు వెళ్ళిపోయాడు కాళిదాసు.

ఇంటికి వెల్లవేయించటం, శుభలేఖలు అచ్చువేయించటం, ముఖ్యమైన వారని పిలవటం అన్నిపనులు ఒక్కరే చేసుకోలేక సతమతమై పోతున్నాడా ఇంటి పెద్ద. కాళిదాసుకు సెలవు దొరకలేదు సమయానికి.

సాధ్యమైనంత సింపిల్‌గా ముగిద్దామంటే కుదిరేట్లు లేదు. ఒకర్ని పిలవకపోతే ఒకరికి కోపం. సంఘంలో గౌరవం హోదా ఉండాయనకి. లేనిదల్లా విత్తమే! మధ్యతరగతి కుటుంబీకులఅవస్థ లెప్పుడూ ఇంతే! ఎక్కడ పరువుపోతుందో అని ప్రతి చిన్నవిషయానికీ బాధపడాల్సిందే.

పెళ్ళి ఇంకా పదిహేను రోజులుండనగా శారద అత్త గారు వచ్చింది గుంటూరు నుంచి. నిన్ను చూడాలనిపించి వచ్చానే తల్లీ! అంటూ. ఆ రోజంతా కోడలిమీద ప్రేమ కురిపించి రెండోరోజు అసలు విషయం బయట పెట్టింది.

"శారదా! నీ పెద్దఆడబిడ్డ కుసుమకి పెళ్ళి కుదిరింది– ఇవన్నీ వాడుంటే అన్నీ వాడే చూసుకునేవాడు" చని పోయిన కొడుకుని తల్చుకుని కొంచెంసేపు ఏడ్చిందావిడ. శారద హృదయం కలుక్కుమంది. నెరవేర్చాల్సిన బాధ్య తల్ని అనురాగాన్ని పంచవల్సిన భార్యని వదిలేసి పర లోకం చేరుకున్న భర్తని తల్చుకుని.

"తల్లీ శారదా! ఇవి చేతులుకావు కాళ్ళనుకో! కట్నానికి రెండువేలు తక్కువైంది–నువ్వేదో ఉద్యోగం చేస్తున్నావని విన్నాను, ఆ డబ్బు సర్దావంటే చచ్చి నీ కడు పున పుడతా! రోజూ దీపం వెలిగించి నీ పేరు చెప్పుకుం టుంది కుసుమ."

అత్తగారి దీనవదనం జూసి శారద మనసు కరిగి పోయింది. కానీ... వెంటనే గుండెలో రాయి పడింది. రెండు రోజుల క్రితమే బాంకునుంచి ఆ డబ్బు తీసుకుంది. చెల్లెళ్ళందరికీ పెళ్ళికి బట్టలు కొన్నది–తండ్రి వద్దన్నా వినలేదు. ఇంట్లో

శుభకార్యం జరుగుతుంటే ఆ మాత్రం కొనకపోతే ఎలా? అని ఆయన్నే ఓదార్చింది. జ్యోతి పెళ్ళికిగూడా పెద్దగా బట్టలు తీయలేదు. అందుకే ఆయన ఎటూ మాట్లాడలేక ఊరుకున్నారు.

ఇప్పుడీవిడ డబ్బడుగుతుంది ఎలా చేయాలి? ఎంత అవసరమైతే అడుగుతోందో? ఆమెకేం చేయాలో తోచ లేదు. మెరుపులా ఒక ఆలోచన మనసులో మెదిలింది. తన రెండుపేటల గొలుసు గాజులజత తండ్రిముందు పెట్టి కన్నీళ్ళతో పరిస్థితి వివరించింది.

ఆయన మాటలురాని ప్రతిమలా నిలబడిపోయారు. "నే చెపితే విన్నావా? అనవసరంగా బట్టలుకొని వేస్ట్ చేశావ్" తండ్రి ముందు దోషిలా తల వంచుకుని నిలబడింది. అంతకన్నా ఏం చేయలేక.

"సర్లే! ముందు అవి తీసి లోపలపెట్టు! ఇదొక అప్రతిష్టపని. నేనే ఎక్కడో తంటాలు పడతాలే" దీర్ఘంగా నిట్టూర్చి బయటికెళ్ళిపోయారు.

ఆ సాయంత్రానికల్లా డబ్బు తీసుకొచ్చి శారద చేతిలో పెట్టారు. "ఎక్కడ తెచ్చారు?" తండ్రి ముఖంవంక సూటిగా చూడలేకపోయింది.

"మా స్నేహితుడు విశ్వనాథం దగ్గర అప్పు తెచ్చాను వెళ్ళు, వెళ్ళి ఆవిడపని జూడు" అలసటగా పడక్కుర్చీలో పడుకున్నారు.

జ్యోతి మంచినీళ్ళు తెచ్చి అందించి, అమృతాంజనం సీసా తెరిచింది. తండ్రికి ఏ సమయంలో ఎలా పరిచర్యం చేయాలో ఆమెకి బాగా తెలుసు. ఆమె ఆ క్రిందటిరోజే వచ్చింది.

"ఇంతమంది ఆడపిల్లలం మీ కడుపున పుట్టి మీకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నాం కదూ?" ఆమె కంఠంలో ఆవేదన సుడులు తిరిగింది.

"పూర్వజన్మలో బోలెడు అబద్ధాలు ఆడుంటాను కదూ జ్యోతీ?" నవ్వలేక నవ్వినట్లుంది ఆయన ధోరణి.

మంజుల కాఫీ తీసుకొచ్చి తండ్రికిస్తూ ఈ మాటలు విననే వింది.

"అన్నీ సత్యాలు చెపితే మగపిల్లలు పుడతారా? అఫ్ కోర్స్...పుట్టినా వాళ్ళలో ఒకడు తాగుబోతు, ఒకడు జూదరి...ఇంకోడు ఎందుకూ పనికిరాకుండా తయారయ్యాడనుకోండి మరి ఆ తండ్రి పూర్వజన్మలో చేసిన పుణ్యాలు వ్రతాల మాటేమిటి?"

ఆయనకి తల పగిలిపోతుందేమో అన్నంత భారంగా ఉంది. మొహం కోపంతో జేవురించింది.

"నువ్వు నోరు మూసుకుని లోపలికి పో!" కోపంతో చూశారు.

"నీకు బొత్తిగా సమయాసమయాలు లేవే! ఆయ

నసలే మనశ్శాంతిలేక బాధపడుతుంటే" జ్యోతి కసురుకుంది చెల్లెల్ని. వాతావరణం గంభీరంగా ఉందని గ్రహించి మెల్లగా అక్కడనుంచి జారుకుంది.

వచ్చినపని పూర్తి చేసుకుని కోడల్ని పదే పదే దీవిస్తూ సంతోషంగా వెళ్ళిపోయింది శారద అత్తగారు. తండ్రిని మళ్ళీ బాధపెట్టాల్సి వచ్చిందే అని శారద లో లోపలే కుమిలిపోయింది. గోరుచుట్టుమీద రోకలి పోటులా ఖర్చు మీద ఖర్చు!

# 16

ఎన్నడూరాని శశిధర్ తల్లిదండ్రులు మంగమ్మ శేషావతారం వచ్చారు. కోడల్ని చూడటానికి వచ్చారు కాబోలనుకున్నారు జానకిరామయ్య దంపతులు. అంతకు ముందే కనకదుర్గ త్రిపుర సుందరి వచ్చేరు. ఇంటికిసగం పెళ్ళి కళ వచ్చేసింది.

పరస్పర పరామర్శలయ్యాక శేషావతారం అసలు విషయం బయట పెట్టాడు. "బావగారూ! అమ్మాయికి పెళ్ళి కుదిరింది; లక్షణమైన సంబంధం."

"చాలా సంతోషం బావగారూ...సరస్వతిది అయిపోతే యిక మంజులా, వసుధ ఉంటారు."

"మీరిహ గట్టెక్కినట్లే లెండి"...

"ఆఁ ఏం గట్టెక్కటమో! అప్పుడే అయిపోయిందీ_ ఇంకా పురుళ్ళు పుణ్యాలు, సీమంతాలు...ఎన్ని లేవు చెప్పండి? ఆవగింజలో అరభాగం కాలా."

"అసలు విషయం అడక్కుండా ఈ సోదంతా ఎందుకూ?" గుమ్మం అవతల నుంచుని మంగమ్మ హెచ్చరించింది భర్తని.

"బావగారూ...మీరు ఖర్చులోఉన్నారు. మిమ్మల్ని అడగటానికి నాకు నోరు రావటంలేదు."

ఆయన ఏం అడగబోతున్నాడో అర్థం కాలేదు జానకిరామయ్యకి.

"మీది మకీ...చోద్యం...అడగండి...ఉంటే ఊ అంటారు...లేకపోతే లేదంటారు. ఎదురుగా మనిషిని పెట్టుకుని ఈ ముసుగులో గుద్దులాట దేనికి? మనం పిచ్చివాళ్ళమై ఈ సంబంధం చేసుకున్నాం. అందరూ మనలాగేఉంటారా?" ఆవిడ గొంతు అసహనంగా ఉంది. మధ్యమధ్య లలితమ్మని

పులుకు పులుకున చూపులతో గుచ్చుతూనే ఉంది.

"ఏం లేదు బావగారూ...వాళ్ళేమో పదివేలు అడిగారు...నాదగ్గర ఏడు వేలున్నాయి. ఇంకా మూడువేలు కావాలి...ఈ కాస్త మీరు సర్దితే...ఆశుభకార్యం కాస్తా అయిందనిపించిన వాళ్ళవుతారు."

ఈ మాటలు వినటంతోనే జానకి రామయ్యకి తల తిరుగున్నట్లనిపించింది. వియ్యపురాలి రాకలోని ఆంతర్యం అర్థమైపోయిన లలితమ్మకి మనసంతా అసహ్యంతో నిండిపోయింది. శారదకి కళ్ళు చీకట్లు కమ్ముతున్నట్లనిపించింది. జ్యోతికి అత్తగారి ధోరణి అర్థం కాలేదు. తన పెళ్ళాం ఇన్ని సమస్యలు తెచ్చిపెడుతుందను కుంటే తనసలు పెళ్ళే చేసుకునేది కాదు."

"అప్పుగానే ఇవ్వండి అన్నయ్యగారూ! ఆయనకి ఎక్కడా దొరక్క మీ దగ్గరకి రావాల్సొచ్చింది." మంగమ్మ కంఠంలో అభ్యర్థన కన్నా అహంకారమే ఎక్కువగా ధ్వనించింది.

"నిజమే...నా పరిస్థితి కూడా కొంచెం ఆలోచించండి. జ్యోతి పెళ్ళయి సంవత్సరం తిరక్కుండానే సరస్వతి పెళ్ళి తలపెట్టానా? నా దగ్గర మాత్రం ఎక్కణ్నుంచి వస్తుంది చెప్పండి"—జానకిరామయ్య ఆవేదన.

శేషావతారం మెత్తబడుతున్నట్లున్నా మంగమ్మ తగ్గలేదు.

"మాదే పొరబాటు లెండి. వేలువేలు కట్నాలిస్తామని కాళ్ళదగ్గరకొస్తే కాదని...దమ్మిడీ కొరగాని మీ సంబంధం...

"మంగమ్మగారూ...మీరు మాటలుమీరుతున్నారు అన్నిటికీ ఇష్టపడే మీరు మా సంబంధం చేసుకున్నారు. అంతా అయిపోయాక మీరిలా పేచీలు పెట్టటం భావ్యం కాదు—ఆయన కోపావేశంతో ఊగి పోయారు.

"అందుకే బుద్ధి చెప్పారుగా—ఏదో బంధువులు అండగా ఉంటారని చేసుకున్నాం. ఆపదలో ఆదుకుంటారని ఆశ పడ్డాం. మాదే బుద్ధితక్కువ" ... చెంపలు టపటపా వాయించుకుంటూ భర్త వేపు తిరిగిందామె. ఇంకా కూర్చున్నారేం లేవక. మీరిలా మెత్తగా ఉండబట్టి—వాడుఇష్టం వచ్చినట్లు తైతక్కలాడి తనకి నచ్చినదాన్ని చేసుకున్నాడు. మన తంటాలు మనం పడదాం...బెల్లంకొట్టిన రాయిలా ఇంకా కూర్చున్నారు దేనికి" భర్తవేపు తిరిగి హూంకరించింది.

యీ అరుపులకి ఇరుగుపొరుగులు కూడా బొల్లిగా చేరుతున్నారక్కడికి, సూరమ్మగారికి వినోదం మహా సంతోషంగా వుంది. పిట్టగోడ ఎక్కి నిక్కినిక్కిచూస్తోంది. సమయం దొరికినప్పుడు తఘారంగంలోకి దూకుదామని.

జానకిరామయ్యా తల కొట్టేసినట్లయింది.

"బావగారూ పెళ్ళి ఎప్పుడు?" ప్రశాంతంగా అడిగారు.

"ఇరవయి అయిదో తారీకున."

"యీ లోగానే సర్దుతాలెండి" ఎటో చూస్తూ బరువుగా అన్నారు. యీ ప్రహసనం ఆయనకి చాలా బాధగా ఉంది. మంగమ్మ మొహం చింకి చాంతాడంతయింది.

"బావగారూ మా ఆవిడ కొంచెం తొందరపడింది. ఏమనుకోవద్దు" శేషావతారం జానకిరామయ్య చేతులు పట్టుకున్నాడు ప్రాధేయ పూర్వకంగా. ఆయన ఏంమాట్లాడకుండా మౌనంగా ఉండిపోయారు. ఆయన హృదయంలో ప్రళయ భంజనం వేస్తోందని గ్రహించారు కుమార్తెలు.



# 17

పెళ్ళింకా నాలుగు రోజులుండగా రామచంద్రం అన్న ముకుందరావు వచ్చాడు. అతను మోసుకొచ్చినవార్త విని భగ్గుమంది ఆ ఇంటిపెద్ద హృదయం.

"కట్నం చాలాతక్కువని మా అమ్మ గొడవచేసింది. మా పెద్దన్న కూడా ఒప్పుకోలేదండీ."

"అదేవిటి అయిదువేలంటేనే నాశక్తికి మించినపనిఅని చెప్పానుకదా"—జానకిరామయ్య.

"ఒప్పుకున్న మాట నిజమేనండీ. మా అన్న, అమ్మ ఒప్పుకోటంలా! నాదేముంది? వాళ్ళెట్లా చెయ్యమంటేఅట్లా చేసే వాణ్ని"—అంటూ తప్పుకున్నాడతను.

పులిమీద పుట్రలా ఇదొకటా? ఇప్పుడేమిటి చెయ్యటం? లెక్కప్రకారం డబ్బు తెచ్చి అన్నిటికీ సర్దేశారు. ఇల్లమ్మగా వచ్చిన డబ్బులో మూడువేలు మిగిలితేఅవికాస్తా శేషావతారం ఎగరేసుకు పోయాడు. పెళ్ళిఖర్చులకి మాత్రం మిగిలింది డబ్బు—అదీ కట్నంకింద పోతే కొత్త అప్పు? ఎక్కడ వున్నది అంత? యీ మునకలో తేలటం అంటూ ఉన్నదా?

"పెళ్ళి నాలుగురోజులుండనగా ఇలా పేచీ పెట్టటం బావుందా?" దీనంగా ఆయన ముఖం.

"నేనేం చేయను చెప్పండి? ఎట్లాగో సర్దండి నాకూ బాధగానే ఉంది" అన్నాడతను బాధనటిస్తూ.

"నేనివ్వలేనండీ!" అన్నారాయన చేసేదిలేక. ఆయనలో సహనం నశించిపోతుంది. సంబంధం చేసికోటం ఇష్టం లేక ఇలా నాటకమాడుతున్నారేమో ననిపించింది.

"పెద్దవారు మీరే అలా అంటే ఏం బావుంటుంది

చెప్పండి? అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకుని ఇప్పుడు పెళ్ళాగి పోతే ఎలా?"

నెత్తిన పిడుగుపడ్డట్లయిందాయనకి. ఇంతదాకా వచ్చి పెళ్ళి ఆగిపోవటమా? బంధువులందరికీ శుభలేఖలు చేరి, అందరికీ తెలిసిపోయాక ఈ పెళ్ళాగిపోతే...తన పరువు ఏ గంగలో కలవాలి? ఆయనకి తల తిరిగిపోతుంది. ఏవిటి భగవాన్! ఈ పరీక్ష అని వాపోయాడు మనసులో.

తలుపు వెనక నిల్చుని వింటున్న లలితమ్మకి మనసంతా కోపంతో ఉడికిపోయింది. భర్త పడుతున్న ఆవేదన తలుచుకుంటే హృదయం దహించుకుపోతున్నది. ఆడపిల్లలను కన్నవాళ్ళ కెన్ని పాట్లురా భగవంతుడా! అనుకుంటూ అక్కడే కూర్చుండిపోయింది స్థాణువులా.

"నా పరిస్థితికూడా కొంచెం ఆలోచించండి మరి? ఉన్నట్లుండి ఎక్కడనుంచి తీసుకురానంతడబ్బు? మొదటే చెబితే మాకుతగ్గ సంబంధం చూసుకునేవాళ్ళం గదా?"

"మీరు తల్చుకుంటే ఆ మాత్రం చేయలేరా?" అతని మాటల్లోని వ్యంగ్యం శూలంలా గుచ్చుకుందాయన మనసుకి.

"ఇంకో వెయ్యిరూపాయలయితే ఇవ్వగలనండీ! అంత కన్నా ఎక్కువయితే...మీరింకో సంబంధం చూసుకోవచ్చు"

ఎటో చూస్తూ బాధగా అన్నారు. ఆయన మనసులో అగ్ని పర్వతాలు బ్రద్దలౌతున్నాయి.

ఏమనుకున్నాడో ఏమో కొంచెంసేపు ఆలోచించి "సర్లెండి మా అన్నకి నచ్చచెబుతాను" అన్నాడు చివరికి మరీ లాగితే తెగేలా ఉందనుకుని.

అతను వెళ్ళిపోయిన తరువాత యుద్ధంలో ఓడిపోయిన సైనికుడిలా కూర్చుండిపోయారాయన. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది-ఎవరో మహామాంత్రికుడు మంత్రించివేసినట్లు. పలకరించే ధైర్యం ఎవరికీ లేదా సమయంలో. "పెళ్ళి కాక ముందే పేచీపెట్టారు, పెళ్ళయ్యాక ఇంకెన్ని తెస్తారో?" మనసు పరి పరి విధాలా పరుగులు తీసింది.

"ఆడదై పుట్టేకంటే...అడవిలో మానై పుట్టటం మేలు. నా మూలంగా నాన్నగారికెంత క్షోభ?" సరస్వతికి కన్నీళ్ళాగలేదు పెళ్ళి కుదిరిందన్న సంతోషం ఆవిరై పోయింది.

"ఈ శుభసమయంలో నీవు కన్నీరు పెట్టగూడదమ్మా మీ జీవితాలు సుఖమయం కావటానికి ఎన్ని బాధలయినా భరిస్తాను. అన్నలు ఎట్లాంటివాళ్ళయితే మనకెందుకు? కుర్రాడు బుద్ధిమంతుడు. అది చాలు మనకు" ప్రేమగా కూతురితల నిమురుతూ సముదాయించారు.

మంజుల మాత్రం కోపం ఆపుకోలేక పోయింది. "ఇంతోటి బోడిసంబంధం మనకి దొరకదా యేవిటి? ఆ వెధవని ఎందుకు బ్రతిమిలాట్టం ఛీ! ఛీ! ఇంత జారిపోతున్నాం కాబట్టే మొగపిల్లలవాళ్ళు మన నెత్తినెక్కి మిరియాలు నూరుతున్నారు" వంటింట్లో తల్లిదగ్గరకొచ్చి పళ్ళు పట పట కొరికింది. శారదకి ఈ జరుగుతున్నదంతా కలో! నిజమో అర్థంకాలేదు.

లలితమ్మ మెడలో ఉన్న రెండుపేటల గొలుసు ఆ మర్నాటికల్లా మాయమవటం కూతుళ్ళందరూ గమనించి నిశ్శబ్దంగా కళ్ళొత్తుకున్నారు. శారద తన నగలు అమ్మమని ఎంత ప్రాధేయపడినా ఆయన ససేమిరా వీల్లేదన్నారు. జీవితం కత్తిమీద సాముగా మారినా చెదిరిపోని గుండె ధైర్యం ఆయనది.

"ఏ అవాంతరమూ రాకుండా ఈ శుభకార్యం జరిపించు భగవాన్!" అంటూ దేవుడిముందు సాగిలబడిందా కన్నతల్లి మనసు.

# 18

పెళ్ళి రేపనగా కృష్ణమోహన్ సుశీలమ్మ వచ్చారు. హైదరాబాదునుంచి వచ్చిన కాళిదాసు అక్కలనూ చెల్లెళ్లను, చిన్నమ్మలనూ, అత్తయ్యలనూ, అందర్నీ చుట్టూ చేర్చుకుని తమాషాగా కబుర్లు చెబుతూ నవ్విస్తున్నాడు. అందర్నీ తప్పించుకుని డాబామీదకి వెళ్లి కూర్చుంది శారద. ఈ పెళ్లిసందడి నవదంపతుల హాస్య పరిహాసాలు, ఛలోక్తులు, ఆమె మనసుని వికలం చేస్తున్నాయి.

శారద వెళ్లటం గమనించిన కృష్ణమోహన్ కూడా మెల్లిగా పైకి వచ్చాడు. కొబ్బరాకుల సందులోనుంచి సాయంసంధ్యా కిరణాలు మందంగా వచ్చి శారదమీద పడుతున్నాయి. విరగబూసిన మాలతీపూల గుత్తిని తుంచి శారద జడలో ఉంచాడతను.

అతని చర్యకు తుళ్లిపడి చూసింది "బావా! నీకు నన్ను చూస్తే పరిహాసంగా ఉందా?" ఏడుపు దిగమింగుకుంటూ అంది.

"శారదా! నువ్వేనా ఇలా మాట్లాడేది? కలలో తేలి వచ్చి కమ్మగా మురిపించే నువ్వు ఈ మధ్య మౌనం వహిం చావేం?"

"ఎందుకీ వృధా ప్రయాస?" విరక్తి ఆ స్వరంలో.

"ఆ నిరాశే వద్దంటాను. లెటర్స్ రాయటం మానే శావు. మావయ్యకు తెలిసిందా మన సంగతి."

"తెలియకుండా ఎన్నాళ్లుంటుంది?"

"ఇంకొన్ని రోజులు ఓపిక పట్టు. అంతే నీ జీవితం పూలనావలో పయనించేలా చేస్తాను. ఈ నిరాశలు, దిగుళ్లు, నిట్టూర్పులు, నిర్వేదనలూ ఏవీ నీ దరికి చేరవు..."

"మరి ఏవి చేరతాయో?"

"చెప్పనా...ఆనందం, అనురాగం, మల్లెలు మమ తలు వాటితో నేనూ సరేనా?" ఆమె పొడవాటి జడని చేతి లోకి తీసుకుని పరవశంగా చెపుతున్నాడు.

"నాకేవిటో భయంగా ఉంది బావా? అత్తయ్య ఒప్పు కుంటుందా?"

ఒక్క క్షణం మవునంగా ఉండి అన్నాడు. "ఒప్పు కోదు-అయినా నేను నిన్ను వదులుకోను...యీ సారి నీ కోసం ఏం తెచ్చానో చెప్పుకో" ఊరిస్తూ ఆమె కన్నులలోకి చూశాడు.

"ఏం తెచ్చావు చీరా?"

"ఊఁ అందమైన తెల్లచీర. ఆ చీరకట్టుకుని తొలిరేయి పాల కడలిలోని లక్ష్మీ దేవిలా నువ్వు నా దగ్గరకు రావాలి. మెత్తగా తెల్లగా వెన్నెల గీతంలా ఆ చీర...నీకు చక్కగా అమరుతుంది శారదా...రాత్రి ఆ తెల్ల చీరలో స్వప్న సుందరిలా సాక్షాత్కరించావు. అదంతా నిజమే అనుకుని" ఆగి ఆమె కళ్ళల్లోకి ప్రేమగా చూశాడు.

"ఊఁ నిజమే అనుకుని"...రెట్టించింది...

"ఆ అందాల రాణిని ఇలా దగ్గరకు తీసుకుని..." అంటూ చటుక్కున ఆమె రెండు చేతులు పట్టుకుని తన మీదకు లాక్కున్నాడు, నున్నటి కపోలంమీద తీయని ముద్ర వేశాడు. చాలా కాలం తరవాత అనురాగ పూరిత మైన ఆ స్పర్శ...ఆమె రక్తం వెచ్చగా వేగంగా ప్రవ హించి, శరీరంలో విద్యుత్ తరంగాలు సృష్టించింది. తన్మయ త్వంలో తనూవల్లి తూలింది.

పరవశించిన మనసు అతని హృదయం మీద వాలి పోయింది. ఆమె మనసు స్వర్గలోకంలో విహరిస్తున్నట్లు... అతని కౌగిలి జాబిలిలో గిలిలా ఆమె శరీరమూ...మనసూ ఏకమై ఒకే మధురగీతమాలాపిస్తున్నాయి.

అతని హృదయంలో కోటి పున్నమిలు విరిసిపోయి, శతకోటి వసంతాలు వెల్లి విరిశాయి. మాటలు కరువైన ఆ మధుర సమాగమానికి సాక్షిగా కలువల రేడు నిండుగా

నవ్వుతూ ఆకాశంపైకి ఎగబ్రాకుతున్నాడు.

మంజుల కంగారుగా పైకి వచ్చి వాళ్ళిద్దర్నీ ఆ స్థితిలో చూసి హడిలి పోయింది. "అక్కా! అమ్మ పిలుస్తున్నది త్వరగా రా" ఇద్దరూ తేరుకుని ఎదురుగా మంజులని చూసి సిగ్గుతో చితికి పోయారు.

శారద గబగబా లేచి తడబడే అడుగులతో కిందకి దిగి పోయింది. "మంజూ! ఎవరితో చెప్పకు" కృష్ణమోహన్ గొంతు భయంతో వణికింది. మంజులకి అతన్ని ఆ స్థితిలో చూసి జాలేసింది. అర్థంలేని ఆచారాలతో మధుర ప్రేమికుల హృదయాలని నిర్దాక్షిణ్యంగా విడదీస్తుంది కదా ఈ సంఘం?" అనిపించి హృదయం ఆక్రోశించింది.

"ఎవరితో చెప్పనులే బావా! నువు మీ అమ్మ అనుమతించే దాకా నిరీక్షించావంటే...పుణ్యకాలం కాస్తా గడిచి పోతుంది...ముసలాడి వాతావే?" గంభీరంగా అంది. ఆమె చూపులు స్నిగ్ధంగా.

"లేదు మంజూ! నీ పెళ్ళి అయిపోతే..."

"ఓయి పిచ్చివాడా?...ఇలా మీనమేషాలు లెక్కపెట్టుకుంటుంటే-అమూల్యమైన కాలం మన కోసం ఆగదు గడిచి పోయిన క్షణాలు తిరిగిరావు...నా పెళ్ళి ఇప్పట్లో తొందరలేదు కాని—త్వరగా ఆ పని ముగించి ఈ కాకులు నోర్లు మూయించు"—

పెద్ద ఆరిందాలా హితోపదేశం చేస్తున్న మరదల్ని ఆశ్చర్యంగా చూశాడు. కిందనుంచి మంజులా అన్న పిలుపు వినబడటంతో "నే వెళుతున్నా బావా? జావగారిపోకు"— అని చెప్తూ ఛెంగున గంతి లేడిలా పరిగెత్తింది కిందకి.

రాత్రి పదకొండు గంటలకి ముహూర్తం సరస్వతికి మంగళ స్నానం చేయించి పెళ్ళి కూతుర్ని చేశారు. నుదుట కల్యాణ తిలకం, బుగ్గన చుక్క, కాళ్ళకు పారాణితో ఎంత శోభని సంతరించుకుంది. అక్కలందరూ తమవి తలా ఒక నగతీసి ఆమెని చక్కగా అలంకరించారు.

తండ్రి కూతుళ్ళకి మా నగలంటూ ప్రత్యేకంగా చేయించలేదు. చదువు మాత్రం చెప్పించారు. విద్యే అసలైన భూషణం అనుకుంటూ.

అలంకరణ పూర్తి చేసి గౌరీ పూజ దగ్గర కూర్చోబెట్టారు. పెళ్ళివారు వచ్చారనే వార్త రావటంతో కలకలం బయలు దేరింది. పెళ్ళి పందిట్లో వాళ్ళకొకావాల్సిన ఏర్పాట్లు చేయాలని కొంద రక్కడికి చేరారు ఉరుకులు పరుగులతో. మగపెళ్ళి వారికి అడుగులకి మడుగు లొత్తకపోతే ఆగ్రహం రావచ్చు!

మంగళ స్నానాలవీ పూర్తయ్యాక వరుణ్ణి విడిదింటి నుంచి వివాహ మంటపానికి తీసుకు రావటానికి బయలు దేరారు జానకిరామయ్య.

కాశీ యాత్ర తతంగం: అదొక వేడుక. వరుడు పావు కోళ్ళు కమండలం చేతబూని కాశీ యాత్రకి సిద్ధమౌతాడు. కాళిదాసు వెళ్ళి "బావగారూ మీరు కాశీ యాత్రకి వెళ్ళొద్దు మా చెల్లెనిచ్చి పెళ్ళి చేస్తాం రండి" అంటూ వరుడ్ని కాశీ యాత్రా ప్రయత్నం నుంచి విరమింపచేస్తాడు. కాళిదాసు పిలిచే తీరుకి అక్కడ చేరిన బంధు వర్గమంతా పకపకా నవ్వేశారు.

వరుడు పీటల మీద కూర్చోబోయే ముందే కట్నమివ్వాలనీ పట్టు బట్టాడు రామ చంద్రం పెద్దన్నగారు. పెళ్ళి పీటల మీద ఇస్తాం అని ఎంత చెప్పినా వినిపించుకోలేదు. తాళం చెవి కాళిదాసు చేతికిచ్చి బీరువాలో ఉన్న డబ్బు తీసుకు రమ్మని చెప్పారు.

ఆయన సంస్కార పూరిత హృదయం అసహ్యంతో నిండి పోయింది. రాను రాను మన వివాహ వ్యవస్థ వ్యాపారంగా మారిపోయింది గదా అనుకుని బాధ పడ్డారు.

ఆరువేలు లెక్కపెట్టి వరుడి అన్నగారి చేతిలోపెట్టి రామచంద్రం స్వగృహానికి తీసుకొచ్చారు.

మంగళ సూత్ర ధారణ జరిగేటప్పుడు మంజులకి కళ్ళ

వెంట నీళ్ళు తిరిగాయి. "ఇన్నాళ్ళు తమలో కలసి మెలిసి తిరిగిన అక్క పరాయిదై పోతుంది అనుకుంది బాధగా. బాజాలు జోరుగా మోగుతున్నాయి తలంబ్రాలు పోసుకున్న తరవాత చదివింపులు చదివించారు.

వధూ వరులిద్దరూ పీటల మీాదనుంచి లేచి గృహ ప్రవేశం చెయ్యబోతుండగా పేరు చెప్పాలంటూ చేతులు గుమ్మానికి అడ్డం పెట్టారు. పేరంటాళ్ళకి అదొక ముఖ్యమైన వేడుక. వధూవరులిద్దరినీ పరస్పరం సన్నిహితం చేసే చిన్న ప్రయత్నంలాటిది.

"మగవాళ్లు ముందు మీారే చెప్పండి!" అంటూ మంజుల అడ్డుతగిలింది.

వదినలు, మరదళ్ళు చుట్టూచేరి అతనేముందు పేరు చెప్పాలని పట్టు బట్టారు. "ఇంత మందీ నేనొక్కణ్నే...నాకు సపోర్టెవరూ లేరా? జాలిగా చూశాడు అందరివంకా—జానకి రామయ్య అక్క కూతురు సునీత "నే ఉన్నాలే అన్నయ్యగారూ"—అంటూ ముందుకొచ్చింది.

అర్థరాత్రి దాటిపోయింది; అందరికీ నిద్రముంచుకొస్తోంది. ఎలాగో పేర్లు చెప్పి బయటపడ్డారు సరస్వతి రామచంద్రం.

తెల్లవారింది! అప్పగింతలు, ప్రయాణ సన్నాహాలన్నీ పూర్తయ్యాయి. ఎవరో ఒకామె అంపకాల పాటపాడుతున్నది. ప్రతివారి హృదయమూ అనిర్వచనీయమైన బాధతో ఊగిపోయింది. ఇన్నాళ్ళు కళ్ళల్లో వత్తులు వేసుకొని పెంచిన ఆడపిల్లను ఇంకో ఇంటికి పంపేటప్పుడు తల్లిదండ్రుల ఆవేదన అనంతం, బాధా ఆనందమూ కలసి అశ్రురూపంలో వెలువడుతుంది.

జానకిరామయ్య హృదయం బాధతో బరువెక్కింది. పసుపు బట్టలతో, కన్నీళ్ళు నింపుకుంటున్న కూతుర్ని చూస్తుంటే ఆయన గుండె నీరై పోయింది. అర్థో హికన్యా పరకీయ యేవ అని హెచ్చరించిందాయన మనసు. ఈ బాధని కాళిదాసు ఎంత సహజంగా వర్ణించాడు? ఆయన హృదయం ఒక్కసారి స్నిగ్ధమై పోతుంది. అరణ్య జీవనాన్ని గడుపుతూ ప్రాపంచిక సుఖాలన్నిటికీ దూరంగా వున్న కణ్వ మహర్షికే తప్పలేదీ హృదయావేదన? తనలాంటి సామాన్య గృహస్థులమాట చెప్పేదేముంది?"

కన్నీటితో అందరి దగ్గరా శెలవు తీసుకుని తండ్రి పాదాలకి నమస్కరించింది సరస్వతి. కుమార్తెని హృదయానికి హత్తుకుని ఆనంద బాష్పాలతో తలమీద చుంబించారు.

# 19

బంధువులందరూ ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. వెను దిరిగి చూసుకుంటే అప్పులు వెక్కిరిస్తూ కనిపించాయా గృహ యజమానికి. అనుకున్న దానికన్నా ఎక్కువగానే ఖర్చు పెట్టాల్సివచ్చింది. ఈ ప్రకారం ఖర్చు చేస్తే మిగిలిన వాళ్ళపెళ్ళిళ్ళు ఎలా చేయగలడతను? భవిష్యత్తులోకి చూడాలంటేనే భయమేసిందా గృహస్తుకి.

రామచంద్రం సరస్వతిని పూనాతీసికెళ్ళి పోయాడు. ఒక బరువు తగ్గిపోయింది గదా అనుకుంటే మంజులమరో దుమారం సృష్టించే ఉంది ఇంట్లో. ఆ ఇంట్లో అందరి ఆడ పిల్లలు ఒక ఎత్తు, మంజుల ఒకఎత్తు, ఆ మెవన్నీ విప్లవ భావాలు, సంస్కరణ పూరితమైన ఆలోచనలు, అవి మన కెంతవరకు నిజ జీవితంలో పనికొస్తాయి అని ఆలోచించదు.

కొన్ని విషయాల్లో చాలా కచ్చితమైన అభిప్రా యాలు జానకిరామయ్యవి, తనఅభిప్రాయానికి వ్యతిరేకంగా పిల్లలు ప్రవర్తించటం ఆయన దృష్టిలో ఆడపిల్లలు ఎంత చదివినా కట్టుబాట్లని అధిగమించ కూడదు. అధిక ప్రసం గాలు చేయటం, మగవాళ్ళతో హద్దులు మీరి ప్రవర్తిం చటం ఆయనకిష్టం ఉండదు. మంజులలో తలఎత్తుతున్న విప రీత ప్రవృత్తి ఆయననిభయపెడ్తోంది. అందుకే బి. ఏ ఫైనల్ పరీక్షలు రాయగానే వరాన్వేషణ ప్రారంభించారు.

ఆ రోజు పెళ్ళిచూపులు :—తల్లి ఈ విషయం చెప్ప గానే ఇంతెత్తున ఎగిరిపడింది. "నేనీ పెళ్ళి చూపులకి కూర్చోను, అసలు పెళ్ళే చేసుకోను. అప్పుడే మీకు బరువయ్యానా?" అంటూ రాగాలు తీసింది.

ఇంట్లో జరుగుతున్న హంగామా గ్రహించి ఆయన లోపలికొచ్చి మంజులవంక గుడ్లురిమి చూశారు. ఆచూపు కెదుర్కొనే శక్తి ఆమెకిలేదు. బుద్ధిగా తల్లి చెప్పినట్లు విని అలంకరించుకుంది. మనసు కుతకుతా ఉడికిపోతూనేఉంది లోపల.

"లక్షణంగా చూసిపోవటానికొస్తుంటే ఆ యేడుపు ముఖం దేనికి?" మందలించింది తల్లి.

అక్కడే కూచుని చెల్లెలి పరిస్థితి గమనిస్తున్నసుందరికి జాలేసింది. ఆమె రెండోసారి పురుడు పోసుకోటానికికొచ్చి రెండురోజులయింది.

"నువ్వూరుకోమ్మా! దానికింకా చదువుకోవాల నుంది. మీరేమో పెళ్ళో అంటూ వెంటపడుతుంటిరి."...

"చదువులొద్దో! అంటే విన్నారా— ఆయనే ఇట్లా పాడు చేసింది తను చూపించిన మార్గమేగా—బాగా చదువుకో తల్లీ అంటూ హితబోధలు చేస్తిరి. ఆ పుస్తకాల్లోది వంట బట్టాక... పెళ్ళీ పెటాకులు ఏం కావాలనిపిస్తుంది." తల్లి చాదస్తానికి చిరాకేసింది అక్కచెల్లెళ్ళిద్దరికీ.

"అసలు నాకు పెళ్ళొద్దు. హాయిగా ఉద్యోగం చేస్తానంటే వినిపించుకోరేం?"

"ఊరుకో మంజూ! నువ్వెంత చెప్పినా ఎవరూ ఆల కించరు.

అసలు మన వ్యవస్థే అంత. ఆడపిల్ల అనగానేఎప్ప డెప్పుడు అవతలకి పంపి చేద్దామా అని ఆలోచిస్తారు తప్ప వాళ్ల అభిరుచులూ, అభిప్రాయాలు కనుక్కుందామని ఆలో చించరు. ఇదొక మహా ప్రవాహం. ఇందులో మనంకొట్టుకు పోక తప్పదు. సుందరి మాటల్లో సత్యంఉందని గ్రహించింది మంజుల.

అయినా తనమనసు ఎదురు తిరుగుతోంది. పెళ్ళితో తన ఆశలకు ఆశయాలకు ఆనకట్ట కడతారు. అందరిలా సామాన్యంగా జీవించటం అదే గాడిలో నడిచిపోవటం ఆమెకిష్టం లేదు. పెళ్ళి, ప్రేమ, పిల్లలు, జీవితంలో గొప్ప ఆశయాలు. అన్నీ మధుర స్మృతులుగా నిల్చిపోవాలి. ప్రతి ధానిలోనూ ప్రత్యేకత ఉండాలి. జీవితంలో కళాత్మకంగా నిత్యనూత్న చైతన్యంలో సాగిపోవాలి రస స్రవంతిలా. అదీ ఆమె వాంఛ.

ఎండ మావుల్ని చూసి ఒయాసిస్సులనుకునే వయ సది. రంగు రంగుల ఊహాలు పొంగు లెత్తి మనసుని గజిబిజి చేసే ప్రపంచం, స్వప్న లోకంలో అందంగా తిరిగాడే అం దాల ఆశయాల హరివిల్లు. ఆ ఇంద్రధనుస్సులోని రంగుల్ని ఆత్రంగా అందుకుని అపురూపంగా గుండెల్లో దాచుకోవా లని ఆరాటం, దానికోసమే ఆవేదన, ఆలాపన.

వరండాలోనుండి తండ్రి పిలుపు వినిపించగానే గబ గబా కళ్లు తుడుచుకుని మవునంగా అక్క వెంట వెళ్ళింది.

తన కిష్టంలేనిపని బలవంతాన చేయిస్తున్నారే అని ఉక్రోషం ఒక పక్కన.

"కొంచెం తల పైకెత్తి చూడమ్మా!" పెళ్ళి పెద్ద ఎవరో అంటున్నారు. కోపంగా తలెత్తి అతనివంక చురుగా చూసి చటుక్కున తల వంచేసుకుంది. అంతవరకూ కాంక్ష నిండిన చూపులతో చూస్తున్న పెళ్ళికొడుకు కంగారుపడి సర్దుకూర్చున్నాడు.

ఆ తతంగం పూర్తికాగానే లోపలి కొచ్చేసిఏడుస్తూ కూచుంది. బహుశా వరుడు నచ్చలేదేమో అనుకున్నారు ఇంట్లో అందరూ.

అలా వరసగా నాలుగయిదు సంబంధాలు వచ్చినా ఎవరూ ఆమె హృదయాన్ని ఆకర్షించలేదు. జానకిరామయ్యలో సహనం క్షీణించిపోతుంది. మంజుల ఆంతర్యం ఏవిటో ఎంతకీ అర్థంకావటంలేదు. గట్టిగా మందలిస్తే ఏడుస్తుంది. దాంతో ఆయన మనసు జాలితో కరిగిపోతుంది ఇలా ఎంత కాలం?

# 20

ఆ రోజు మంజుల కాలేజీనుంచి వచ్చేసరికి తల్లిదండ్రుల మధ్య పెళ్ళిళ్ళ గురించిన ఆశక్తికరమైన సంభాషణ జరగటం గమనించింది. కాళ్ళు కడుక్కుని వంటింట్లో

కెళ్ళి చక్కిలాలు తీసి ప్లేట్లో వేసుకుని ఒక్కొక్క తుంపు నోట్లో పెట్టుకుంటూ వాళ్ళ సంభాషణ ఆలకిస్తుంది.

"చంద్రశేఖరంగారమ్మాయి వేరే కులంవాణ్ణి ప్రేమించిందట."

"ఆయన మంచి ఆచారపరుడు గదా...కూతురు చేస్తున్న పని చూస్తూ ఎలా ఊరుకున్నాడండీ?" లలితమ్మ బుగ్గలు నొక్కుకుంది.

"ఆయనకి తెలీదు పాపం...ఏదో మామూలు స్నేహం అనుకున్నాడు మొదట్లో—చివరికి లెటర్ రాసి ఇంట్లో పెట్టి వాడితో పారిపోయిందట. ఏం చేస్తాడు పాపం! కన్న మమకారం—నాలుగయిదు నెలలు కోపంగా ఊరుకున్నాడు. ఆ తరవాత మామూలుగా ఊరుకున్నాడు. ఇప్పుడు రాకపోకలు కూడా సాగిస్తున్నారట. అంతే... రోజులు మారిపోయాయి. ఆ పిల్ల తన జీవితం సంగతి తన ఆశయాల గురించే ఆలోచించిందే గానీ తన చెల్లెళ్ళ భవిష్యత్తు గురించి ఆలోచించలేదు. మిగతా పిల్లలకి సంబంధాలు కుదరటంలేదు. నానాగడ్డీ కరుస్తున్నాడు చంద్రశేఖరం... ప్చ్! ఏవిటో" జాలిగా నిట్టూర్చాడాయన.

"తక్కిన పిల్లలుకూడా తలాఒక కులంవాడిని చేసుకుంటే సరి..." అదే పరిష్కార మన్నట్లు చూసిందావిడ భర్త వంక.

"బాగానే ఉంటది... రేపు వీళ్ళకి పుట్టబోయే పిల్లల గతేవిటి? వాళ్ళు ఏ కులం అని చెప్పుకుంటారు? ఎలా చెలామణి అవుతారు సంఘంలో? వాళ్ళ భవిష్యత్తేమిటి! ఇలా

టివి బోలెడు సమస్యలు ఎదురవుతాయి. వాటిని యెదుర్కొనే గుండెధైర్యం గలవాళ్ళే ఆ పని చేయాలి."

"అది సరేగానీ ఆ సుబ్బారావుగారమ్మాయి డాక్టరు చదువుతున్నదా? నెలకొకణ్ని మారుస్తుందట...అవేంపోయే కాలం బుదులండీ...చదివేయి పెద్ద చదువులు చూడబోతే అన్నీ పాడు బుద్ధులు..."

"అంతేనేమరి...డబ్బుంటేసరి...ఎన్ని తప్పులున్నా కనిపించవు—అదే బీదవాడికూతురు చేసిందనుకో—ప్రతి వాళ్ళు వేలెత్తి చూపేవాళ్లే ఈ సంఘం డబ్బు, హోదా ఉంటే వారికి గులాము."

"ఏవిటో అంతా డబ్బులోనే ఉంది మహాత్యం? శారద జీవితం ఎట్లా తెల్లవారుతుందో? దాన్ని గురించి తలుచుకుంటే నాకు కంటిమీద కునుకుండదు. పిల్లా పాపలతో కళకల్లాడాల్సిన దాని జీవితం—హఠాత్తుగా స్తంభించిపోయింది" ఆ మాతృ హృదయంలో ఆవేదన వెల్లువలా దూకింది.

శారద ప్రసక్తి రాగానే ఆయన ముఖం బాధతో ముడుచుకుపోయింది.

"బాగున్నారా వదినగారూ!" అన్న పలకరింపు వినబడటంతో ఇద్దరూ త్రుళ్లిపడి చూశారు. జ్యోతి అత్తగారు మంగమ్మ. మొహాన చిరునవ్వుతో ఇంట్లోకొచ్చింది. వియ్యపురాలు ఇలా హఠాత్తుగా వూడి పడటంతో దంపతులిద్దరూ తెల్లబోయారు.

"ఏవిటమ్మా వదినా! అట్లా చూస్తున్నావ్ నేనే!" అంటూ నవ్వింది మంగమ్మ.

"దారితప్పి వచ్చారేలని చూస్తున్నారండి" అంటూ లోపలికి తీసికెళ్లి చాప వేసింది.

"దారితప్పలేదమ్మోయ్! దారి తిన్నగా చూసుకుంటూనే వచ్చా" అంది నవ్వుతూ.

జానకిరామయ్య లోపలికొచ్చి "అంతా బావున్నారామ్మా" అని కుశలప్రశ్నలు వేసి మరలా ముందుగదిలోకొచ్చి చదువుకుంటూ కూర్చున్నారు.

"ఏవమ్మా కోడలు పిల్లా! పప్పన్నం ఎప్పుడు పెడతావ్? అంటూ హాస్యమాడింది లోపలకొచ్చిన మంజులను చూసి.

"ఏం పప్పన్నమో వదినగారూ! ఒక్క సంబంధమూ కుదరటం లేదు. ఎక్కడ రాసిపెట్టాడో. దేవుడు దీనికి. లలితమ్మ కూతుర్ని చూసి దీర్ఘంగానిట్టూర్చింది.

"ఛీ! ఛీ! ఈ పెద్ద వాళ్ళ కెప్పుడూ పెళ్ళి గోడవే! – మొహం చిట్లించుకుంటూ అవతలికెళ్ళి పోయింది.

"కక్కొచ్చినా కల్యాణమొచ్చినా ఆగదు లేవమ్మా వదినా! మొన్న కాకినాడనుంచి వచ్చినవాళ్ళు మీరే ఏదో పేచీ పెట్టారని అన్నట్లున్నారు." ...అంది మంగమ్మ రంధ్రాన్వేషణ ప్రారంభిస్తూ.

"అదేంలేదే! వాళ్ళే కట్నం చాలా ఎక్కువలడిగారు. అందుకని మేం తూగలేంకదా అని సర్దుకున్నాం" తడబడింది లలితమ్మ.

"నేను ఏమని విన్నానంటే... అమ్మాయే అబ్బాయి నచ్చలేదని అన్నదట...అహా...ఎవరో అనుకుంటేవినటమే నాకుమాత్రం ఏం తెలుసు"

"అదీ కొంతనిజమే అనుకోండి. చూస్తూ చూస్తూ బంగారబొమ్మలాటి పిల్లని తీసికెళ్ళి అలాటివాళ్ళకి ఎట్లాకట్ట బెడతాంచెప్పండి."

"అంతేనమ్మా వదినా...మాకు రాడికి మాత్రం ఏం తక్కువని, వాడుమనసు పడ్డాడుకదాని ...గుడ్డిపిల్లని చేసుకున్నాంకదా?"

"లలితమ్మకి ఎక్కడ తగలాలో అక్కడ తగిలిందా దెబ్బ... అయినా ఏంకాలమో! ఏంపిల్లలో? మగపిల్లలు నచ్చటం లేదంటే విడ్డూరం కదూ?"

"మగాడయితే చాలు వాడు ఏ మానైనా మొద్దయినా ఫరవాలేదన్నమాట" కసిగా తనలోతనే పళ్ళు కొరుక్కుంది మంజుల. ఆవిడ మాటలధోరణి సుందరి కసలు నచ్చదు. అందుకే స్వెటరల్లుకుంటూ మౌనంగా ఉండిపోయింది.

"ఏవమ్మా సుందరీ ఎన్నో నెల?" అంటూ పరామర్శించింది.

సమాధానం చెప్పేసి తనపనిలో మునిగి పోయింది సుందరి. సుందరితో మాటలు పెంచుకుందామనుకున్న మంగమ్మకి ఆశాభంగమే అయింది. లలితమ్మ వైపుకి తిరిగి తన మామూలు మాటలధోరణిలో పడిపోయింది.

"నీకు ముఖ్యంగా ఒకమాట చెప్పాలని వచ్చాను లలితమ్మా!" అంది తగ్గుస్వరంలో.

గొంతుసవరించుకుని మొదలుపెట్టింది. శారద హైద్రాబాద్‌లో ఉన్నప్పుడు ఇష్టంవచ్చినట్లు ఉంటున్నదట. ఈమధ్య మాతోడి కోడలు కొడుకు హైద్రాబాద్ వెళ్ళినప్పుడు చూశాట్ట. ఏం పిన్నీ! ఆపిల్లవిథవకదా! బొట్టు పూలు పెట్టుకుని మనతమ్ముడితో ఆషికార్లేవిటి? అనిఅడిగాడు. నాకుతల కొట్టేసినట్లయిందనుకో. శారదని పంపేబదులు నువ్వేవెళ్ళి ఉండరాదటమ్మా..."

లలితమ్మ మనసు చివుక్కుమంది ఆమాటలకి. "మా పిల్లలు అట్లాటి పరువుతక్కువపనులు చేసేవాళ్ళుకాదమ్మా"

"అయితే నేనుఅబద్ధం చెపుతున్నానంటావా?" కయ్యిమంది మంగమ్మ.

"అలా అనలేదమ్మా" కంగారు పడింది.

"మరి కాకపోతే...వచ్చేనెల్లో జ్యోతికి ఆపరేషన్ చేస్తానంటున్నాడు వాడు. ఆ ఖర్చులన్నీ మీరు భరించాల్సిందే...ఇంకోసారి చెపుతున్నా. శారద ఇలా పరువు తక్కువగా ప్రవర్తిస్తే— జ్యోతిని వెంటనే మీ ఇంటికి పంపేస్తాం. ఆ తరవాత మీ ఇష్టం." కొంగు దులుపుకొని వెళ్ళిపోవటానికి లేచిందావిడ.

"కూర్చోండి వదినా—కాఫీ చేస్తాను" అని లేచింది లలితమ్మ బరువెక్కిన హృదయంతో.

మంజుల కోపం పట్టలేక పోయింది. "అత్తయ్యగారూ మీ అమ్మాయి పెళ్ళికి మీరునాన్నగారి దగ్గరచేసిన అప్పు

తీర్చేశారా?" లోపలికొచ్చి ప్రశాంత స్వరంతో అడిగింది.

"అవన్నీ నీకెందుకు చిన్నపిల్లవి"—రుస రుసలాడిం దావిడ.

"ఇందాక పెళ్ళి ఎప్పుడన్నారుగా—అంటే పెద్దపిల్ల కింద లెక్కే కదా? మీరు అప్పుగా తీసుకున్న డబ్బు అక్క ఆపరేషన్‌కింద ఖర్చుపెట్టండి. సరిపోతుందిగదా"—మంజుల ధోరణి ఆవిడకి బొత్తిగా నచ్చలేదు.

"ఇదుగో—నోరుకాస్త అదుపులో పెట్టుకో. పెద్దా చిన్నా లేకుండా మాట్లాడకు పెళ్ళికావల్సిన పిల్లవి. అవన్నీ మేం చూసుకుంటాం నీకెందుకు?"

"ఆపరేషన్ ఖర్చులు మీరే భరించండి—అని కచ్చితంగా చెబుతున్నారుగా"

"మంజులా!" అని గట్టిగా పిలుపు వినబడటంతో భయంగా చూసింది. వాకిలి దగ్గర తండ్రి నిలబడివున్నాడు. ఆయన కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. "అతివాగుడు కట్టిపెట్టి నీపని చూసుకో."

మంజుల తలవంచుకుని అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

"అన్నగారూ—మీదెంత శాంత స్వభావం? మీ కడుపున ఇలాటిపిల్ల ఎలాపుట్టిందో గానీ"—

లలితమ్మ చేతిలోనుంచి కాఫీకప్పు అందుకుంటూ సానుభూతి ప్రకటించింది.

"దానికొంచెం నోటి దురుసు—మీరేమీ అనుకోకండి"—అని కూతురు తరపున సంజాయిషీ ఇచ్చుకున్నా రాయన.

ఆవిడ శాంతించినట్టే కనిపించింది. ఆపరేషన్ ఖర్చుల గురించి వియ్యంకుణ్ణి మరోసారి హెచ్చరించి మెల్లగాఇంటి దారి బట్టింది మంగమ్మ. భారమైన హృదయంతో పడక్కుర్చీలో వాలాడు ఆ గృహయజమాని.

# 21

ఆ రోజు ఆయనకి మనసంతా చాలా చికాగ్గా ఉంది. శారద ఎదురుగా ఉంటే ఎడాపెడా తిట్టెయ్యాలన్నంత కోపం ముంచుకొచ్చింది. కానీ ప్రస్తుతం ఆమె ఇంట్లోలేదు. జ్యోతి కళ్ళకి ఆపరేషన్ చేస్తారంటే పంపించారు హైదరాబాదు.

మొదట్లో లలితమ్మని పంపించాలనుకున్నారు గానీ. జ్యోతి శారదక్క తన పక్కనే వుండాలని కళాధర్ చేత ఉత్తరం వ్రాయించింది. దాంతో పంపకతప్పలేదు. మంగమ్మ శారదని గురించి తేలిగ్గా మాట్లాడినాక ఆమెని పంపించకూడదనే అనుకున్నారు, ... ఆ అక్కాచెల్లెళ్ళ అనుబంధం గాఢమైంది. అదీగాక సుందరికి పురిటిరోజులు, ఎప్పుడుపురుడొస్తుందో తెలీదు.

మనసంతా మహా చికాగ్గావున్న సమయంలోనే కృష్ణమోహన్ తల్లి సుశీలమ్మ రాసిన ఉత్తరంవచ్చి ఆయన మనసుని మరింత చికాకు పెట్టింది. ఆ ఉత్తరం చదువుతున్నకొద్దీ

ఆయనకు మతి పోతున్నట్లుగా అనిపించ సాగింది. తానేవో అగాధాల్లోకి కూరుకు పోతున్నట్లుగా ఫీలయ్యారు.

అన్నయ్యకు నమస్కరించి,

నువ్వింత స్వార్థపరుడివనుకోలేదు. నీ విధవ కూతురు జీవితం బాగుపడాలనే తాపత్రయంతో నా కూతుళ్ళ భవిష్యత్తుని గురించి మర్చిపోతున్నారు. నువ్వు కవీ, రచయితా ఇంత నీచంగా ఇంత స్వార్థపూరితంగా ప్రవర్తిస్తావనుకోలేదు.

కృష్ణమోహన్ ఎన్ని సంబంధాలు వచ్చినా ఎందుకు తిప్పి పంపుతున్నాడో నాకు బాగా అర్థమైంది. మీ తండ్రీ కూతుళుళ్ళిద్దరూ కలసి వాడి మనసు మార్చారు. నా కొడుకుని నాక్కాకుండా చేస్తున్నారు. నా వుసురు మీకు తగలక మానదు.

నాలాగా ఆడపిల్లలు నీకు ఉన్నారు. వీడి కట్నం డబ్బుతో, మిగిలిన ఆడపిల్లల పెళ్ళి చెయ్యాలన్న మా ఆశ నాశనం చేస్తున్నారు. ఇది నీకు న్యాయం కాదు.

శారద ఈ ఇంటి కోడలవటం యీ జన్మలో జరగని పని. అలా జరిగిన పక్షంలో నా శవం మాత్రమే నువు చూస్తావు.

నీ కూతుర్ని ఎలా అదుపులో పెట్టుకుంటావో నీఇష్టం. ఇంతకన్నా ఎక్కువ వ్రాయలేను. నా బాధ అర్థం చేసుకో! వాడికి నచ్చచెప్పు. శారదనివాడికి సాధ్యమైనంత దూరంగా ఉంచు.

నీ చెల్లెలు
సుశీలమ్మ.

ఆ ఉత్తరంలోని ఒక్కొక్కముక్క ఆయనహృదయాన్ని చీల్చేసింది.

బీరువాలోనుంచి ఇన్‌లాండ్ కవరు కవరుతీసి శారదకి ఘాటుగా ఉత్తరం రాసి పడేశారు. అప్పటిగ్గానీ ఆయనకి ఆవేశం చల్లారలేదు.

మళ్ళీ ఆ రాత్రంతా ఆలోచనలు. శారద దీనవదనం... పెంచుకున్న ఆమె ఆశలు కూలిపోతున్న కలలు... భయంకరమైన ఆమె భవిష్యత్తు...శాపంగా పరిణమించిన శారద యవ్వన సౌందర్యాలు...ముందుకు పోలేక వెనక్కూ రాలేక కొట్టుమిట్టాడే తన దీన స్థితి...ఆ రాత్రంతా ఆలోచనలతో నిద్ర రాలేదు. తల బద్దలై పోతున్నట్టుగా అనిపించసాగింది.

తెల్లారి లేచి చింత నిప్పుల్లా వెలిగి పోతున్న భర్త కళ్ళని చూసి భయపడింది లలితమ్మ.

“ఏం ఒంట్లో బాగా లేదా?”

“మనసే రణరంగంగా ఉంది. అప్పుడే తెల్లారిందా?” అన్నారు కిటికీలోనుంచి బయటికి చూస్తూ, అప్పుడే పేపరు కుర్రాడు పేపరు విసిరేసి వెళ్ళిపోయాడు:

“చాలా సేపయింది. తెల్లవారు జామునుంచీ సుందరికి నొప్పులు మీరెళ్ళి ఆ రత్నమ్మని పిలుచు కొస్తారా? పిల్ల బాధతో మెలిదిరిగి పోతున్నది.”

“చెప్పవేం మరి?” గబగబా లేచి చొక్కా వేసుకుని చెప్పులు తొడుక్కుని బయటికి నడిచారు.

సుందరికి నొప్పులొస్తున్నయ్యని తెలిసి ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా వచ్చారు. కూతురి పొట్ట నిమురుతూ

ధైర్యం చెప్తున్నదిగానీ ఆమెకీ భయంగా ఉంది. సుందరికి కాన్పు చాలా కష్టం. కూతుళ్ళకి పురుళ్ళన్నీ ఇంట్లోనే చేసే అలవాటు హాస్పిటల్ కి వెళ్ళరు.

సుందరి బాధ భరించలేక గట్టిగా అరుస్తోంది. ఇరుగు పొరుగులు సానుభూతి వచనాలు చెప్తున్నారు. లలితమ్మకి కూతురి పరిస్థితి చూస్తుంటే కాళ్ళాడటం లేదు.

ఇంతలో మంత్రసాని రత్నమ్మ రానే వచ్చింది అందర్నీ బయటికి పంపేసి గది తలుపులు వేసేసింది.

మూసి ఉన్న తలుపుల వెనుక ఏం జరుగుతుందో ఆ ప్రాణి ఇంకో ప్రాణికి జన్మ ఇచ్చే తరుణంలో ఎలా బాధతో విలవిల లాడుతోందో-అందరి మనసులు భయంతో కొట్టుకుంటున్నాయి.

అరగంట తరవాత రత్నమ్మ గది తలుపులు తీసుకుని బయటి కొచ్చింది. జానకి రామయ్యని దగ్గరకి పిల్చింది "లోపల బిడ్డ అడ్డం తిరిగిందండీ, హాస్పిటల్ కి తీసికెళ్ళండి-"

ఆయనకి మూర్ఛ వచ్చినంత పనైంది. ఇటువంటి పరిస్థితి ఎప్పుడూ రాలేదు. టాక్సీ తీసుకు రావటానికి కంగారుగా బయటి కెళ్ళారు. లలితమ్మ చిన్నగా ఏడుస్తూ ఒక సంచిలో కావలసిన వస్తువులన్నీ సర్దుతోంది.

ఆమెకి గుర్తులేని వస్తువులు పక్కింటి సూరమ్మ, ఎదురింటి స్వరాజ్యం గుర్తు చేసి అందిస్తున్నారు "భయపడకుండా ఉండమని ధైర్యం చెప్తున్నారు.

"ఇలాగే బిడ్డ అడ్డం తిరిగితే...తన పెత్తల్లి కూతురు ఎలా చనిపోయిందీ" వర్ణించి చెప్తోంది ఇంకో తెలివిచల

ఇల్లాలు వాళ్ళు మాట్లాడే చావు కబుర్లు వింటుంటే ఆ మాతృ హృదయం విపరీతమైన భయంతో వణికి పోయింది."

వాకిట్లోకి టాక్సీ వచ్చి ఆగింది అందరూ సాయం పట్టి సుందరిని టాక్సీలో చేర్చారు. లలితమ్మ ఇంటిని మంజులకి అప్పగించి టాక్సీ ఎక్కింది. ఆవిడకి భయంతో గుండెలు దడదడ మంటున్నాయి.

సాయంత్రానికి ఉసూరు మంటూ ఇంటి కొచ్చిన తండ్రిని చూసి "అక్కయ్యకెలా ఉంది నాన్నా?" అంటూ మంజుల ఎదురొచ్చింది.

"ఆపరేషన్ చేసి బిడ్డని బయటికి తీశారు. మగపిల్లాడు అక్కయ్య చాలా నీరసంగా ఉంది" ఆయాసంగా పడక్కుర్చీలో వాలిపోయి అలసటగా కళ్ళు మూసుకున్నారు. ఆ రోజంతా ఏమీ తినక పోవటంతో విపరీతమైన నీరసం ఆవరించింది.

సుందరికేమై పోతుందో నన్న ఆత్రంతో కాఫీ కూడా తీసుకో బుద్ధి కాలేదు. ఆపరేషన్ పూర్తవగానే అల్లుడికి టెలిగ్రామ్ ఇవ్వటం, కాలేజీకి లీవ్ లెటర్ పంపటం, ఈ పనులతో సరిపోయింది.

"ఈ జీవన సంగ్రామం ఎప్పటికి ముగిసేను భగవాన్" అనిపించిందారోజు మాత్రం.

గవర్నమెంటు హాస్పిటల్‌లో ఆపరేషను! అడుగడుగునా అందరికి లంచాలు సమర్పించుకోటం డబ్బు నీళ్ళలా ఖర్చయిపోయింది. డబ్బు కోసం చూసుకుంటే ప్రాణం? ఉరుకులు పరుగు పెట్టి అప్పు తెచ్చి అన్నిటికీ సర్దే సరికి తల

ప్రాణం తోక కొచ్చింది. నెలాఖరులో డబ్బెక్కణ్నుంచి వస్తుంది?

ఈ మధ్య శారద సంపాదనలో ఎక్కువ భాగం, సుందరికేమైనా కొనటానికీ, జ్యోతి సంసారానికా వలసి నవి అమర్చ టానికీ సరిపోతోంది.

సుందరి హాస్పిటల్ నుంచి ఇంటి కొచ్చే సరికి ఆయన చేసిన అప్పు కొండలా పెరిగి పోయింది.

మంజుల పెళ్ళి కోసం దాచిన డబ్బు కూడా కరగటం ప్రారంభించింది. కొత్తగా ఉద్యోగంలో చేరిన వాడు కాళి దాసు మాత్రం తండ్రికేం సహాయం అందిస్తాడు? అందులో హైదరాబాదు నివాసం.

అతను కాస్త దుబారా ఖర్చు! ఎటు చూసినా ఆయన కెవ్వరు చేయూతనిచ్చే వాళ్ళు లేరు.

ఆయన రాసిన పుస్తకాలు, అచ్చవుతున్న సాహి త్యాలు వ్యాసాలు ఇవే ఆయన కాధారం.

# 23

హైదరాబాదు నుంచి కాళిదాసు రాసిన ఉత్తరం చదువుతుంటే ఆయన మనసంతా అవ్యక్తమైన వేదనతో నిండిపోయింది.

ప్రియ జనకులకు, పాదాభి వందనములతో.

మీరు వ్రాసిన లేఖ చేరింది. ఈ సమస్యల వలయంలో గిరగిరా తిరుగుతూ కూడా మీరు నాకు సంబంధాలు చూస్తున్నారంటే ఎంతో ఆశ్చర్యంగా ఉంది.

ఈ సమస్యలకి మిమ్మల్నొక్కర్నే ఎరగా వేసి నేను తప్పుకోవాలను కోవటం లేదు.

నా ఉద్యోగం పర్మినెంటు అయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. జ్యోతి కళ్ళకి ఆపరేషన్ జరిగింది. కానీ, కట్లు విప్పే దాకా ఏ విషయమూ చెప్పలేమన్నారు డాక్టరు.

ఏది ఏమైనా దానికి దేవుడు లాంటి భర్త దొరికాడు తనని గురించి మనం విచారించాల్సిన పని లేదు. ఇంకొక్క విషయం మీరు భరించలేనిది రాస్తున్నాను.

మనసు కుదుట పరుచుకోండి. ఎప్పుడో ఒకప్పుడు ఇది ఇలా జరగాల్సిందే...కాకపోతే కొంచెం ముందు జరిగిందంతే. శారదక్క కృష్ణమోహన్ బావ రిజిష్టర్ మారేజ్ చేసుకున్నారు. అత్తయ్యా మావయ్యా కాకుల్లా అరచి గోల చేస్తారు. మీరేం బెదిరిపోకండి మారే కాలంలో మనమూ మారాలి. మార్పులోనే చైతన్యం...అదే జీవన స్రవంతి. మీ మనసు బాధ పెడితే క్షమించండి.

మీ కాళిదాసు

అంత రంగంలో ఎగిసిపడే భావతరంగాలకి ఆయన హృదయం ఆటు పోటులతో నిండిన కడలిలా ఉంది.

ఆ ప్రళయ ఘోష ఆయన చెవులకి భయంకరంగా వినబడింది.

"ఏమండీ! మంజుల స్నేహితురాలింటికని వెళ్ళి ఇంకా రాలేదు. దాని ప్రవర్తన ఈమధ్య ఏం బాగాలేదు. మనం సుందరి ఆపరేషను గొడవలో ఉంటే అది స్నేహితులతో సినిమాలు షికార్లు ఎక్కువ చేసింది. మీరే దాన్ని ఎక్కువ గారాబం చేసి చెడ గొట్టారు—"

భార్య మాట్లాడే మాటలు వింటూ ప్రశాంతంగా ఉండి పోయారాయన.

ఆమెకి ఏమీ సమాధానం చెప్పాలనిపించ లేదు.

ఇంతలో సుందరి బాబునెత్తుకుని వాళ్ళున్న దగ్గర కొచ్చింది.

"నాన్నగారూ, మంజు మీకేదో లెటర్ రాసినట్లుంది-"

తండ్రి మొహంలోకి భయంగా చూస్తూ లెటరందించింది.

ఆ లేఖతో బాటు మనవణ్ణి కూడా తీసుకుని వళ్ళో పడుకో బెట్టుకున్నారు.

నింపాదిగా ఆ ఉత్తరం తెరిచారు.

ప్రియమైన నాన్నగారికి నమస్కరించి,

మీ శిక్షణలో క్రమ బద్ధమైన వాతావరణంలో పెరిగిన నేను ఎలాటి తప్పు చేయను. ఆ సంగతి మీకూ తెలుసు. ఆ విశ్వాసంతోటే ఈ లేఖ చదవండి.

సంప్రదాయపు సంకెళ్ళల్లో బిగిసి పోయిన మీ హృదయం నే చేసిన పని హర్షించదు. కానీ ఆత్మవంచనచేసుకుని నేను బ్రతకలేను, అందుకే ఈ నిష్క్రమణ.

నాలో పెరుగుతున్న అభ్యుదయ భావాలు మీకు నచ్చవు. మీ దారిలో ఒదిగిపోయి ఆ మామూలు జీవితం

గడపటం నాకు చేతకాదు. నిప్పులాంటి వంశంలో పుట్టి ఇలాటి పని చేస్తావా? అని మీరు నిందించవచ్చు. అయినా నిప్పులాంటి మరో వ్యక్తితో నా జీవితం పంచుకుంటున్నాను.

అతనిది మన కులం కాదు కనీసం మన మతమైనా కాదు. అయినా అన్ని మతాల సామరస్యం అతని హృదయంలో నిండుగా ఉంది.

సమత, మమత అతని తోబుట్టువులు...సంస్కారం అతనికి వెన్నతో పెట్టిన విద్య.

ఆ వ్యక్తి నీడలో నా జీవితం పండించు కుందామని ఈ సాహసం చేశాను. ఆ వ్యక్తి ఎవరో కాదు మీకు చిర పరిచితుడే...మీరు సంస్కార వాది అని మెచ్చుకునే శ్యామసుందరంగారి కుమారుడు మురారి—మీ కిష్టమైన పేరే...

వాళ్ళ కుటుంబం అన్ని మతాల కులాల కూడలి. నా భవిష్యత్తును నేనే నిర్ణయించుకున్నానని కోపగించుకోవద్దు. మీరు కోపంతో శపించినా అవి నా పాలిట వరాలే...

ఇంత మంది ఆడపిల్లల్ని కని పెంచి పోషించి... పెళ్ళిళ్లు చేసి విలువైన మీ జీవితాన్ని మా కోసం త్యాగం చేశారు.

సాహిత్యంలో ఉన్నత శిఖరాలనందు కున్నారు కవిగా, రచయితగా, సంస్కర్తగా పేరు తెచ్చుకున్నారు. దయచేసి నా మీద కోపం వద్దు.

తరతరాల హైందవరక్తం, సంప్రదాయాల సమ్మేళనంతో మీలో ప్రవహిస్తున్నది...

అదే రక్తం నాలోనూ ప్రవహిస్తున్నది.

మీ జీవితానికి కళంకం తెచ్చే పని నేనెన్నడూ చేయలేదు. ఆ ఆత్మ విశ్వాసంతోనే...మీరు సంతోషంగా అనుమతిస్తే మీ ఆశీస్సుల కోసం జంటగా వస్తాం లేకంటే మీ గుండెల్లో చెలరేగిన బడబాగ్ని చల్లారే వరకు మీకు కనిపించను.

నా కారణంగా అమ్మని తిట్టవద్దు. ఆడపిల్లను కనిపెట్టి ఉండలేవా? అని కఠినంగా శిక్షించవద్దు.

కానీ ఒక్కటి మాత్రం మర్చిపోకండి.

మీ ప్రేమ మమతకు దూరమై నేను మాత్రం ఎక్కువ జీవించలేను అది మాత్రం అర్థం చేసుకోండి.

పాదాభివందనలతో

మీ

మంజు

"మంజూ! ఎంత పని చేశావమ్మా?"—

ఆయన హృదయం బాధగా మూలిగింది.

బంధువులు, సమాజం చూసే క్రూరపు చూపులు తలుచుకుంటే శరీరం భయంతో కంపిస్తోంది.

సుందరి తండ్రి వంక సూటిగా చూడలేక పోయింది.

ఆధునికత ఆత్రంగా పరుగులు తీస్తుంటే సంప్రదాయాల సంకెళ్ళు తెంచుకోలేని పెద్దలు దీనంగా చూసే చూపులు—ఆ చూపులకి భాష్యం చెప్పలేం—అర్థాలు వెతుక్కోలేం.

"ఏవిటి-సుందరీ-ఏమైందే? తండ్రీ కూతుళ్ళిద్దరూ బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడరేం?"

తల్లి కంగారు చూసి సుందరికి పెదవి విప్పక తప్ప లేదు.

"ఎంత పరువుతక్కువ పని చేశావే? దానికసలే తొందర—ఆ చదువులూ పాడూ వద్దు అంటే విన్నారా?" ఆమె ఆవేదన అంచులు దాటుతోంది.

"ఛ! నోర్మూయి! అరిచి గోలచేయకూ, ముందు నువ్వు లోపలికెళ్లు."

లలితమ్మ లోపలికెళ్ళిందిగానీ మనసు కుదురుగాలేదు ఛిన్నాభిన్నమై పోతుందేమో కూతురి జీవితం అని మనసు అల్లాడిపోతుంది.

"నా పెంపకంలో...శిక్షణలో ఎక్కడఉంది లోపం?" ఆయనకి ఆలోచనలు తెగటంలేదు.

మాలతి లతవంక చూస్తుంటే ప్రగతిశీలమైన యీ సమాజంలో ఎన్నెన్నో మార్పులు! అనిపించింది.

నిన్న మొన్నటిదాకా సాఫీగా సాగిపోయిన యీ జీవన స్రవంతి హఠాత్తుగా ఒక కొత్త మలుపు తిరిగింది.

ఈ మలుపులో ఏమి ఎదురవబోతున్నాయో? ఎన్ని సమస్యల విచ్చు కత్తులు గుచ్చుకోవటానికి సిద్ధంగా ఉన్నాయో ?

